శ్రీ



# ప్రసన్న భారతి

(ఈనాటి పలువురు ప్రసిద్ధాంధ్ర కవులు
శ్రీ సరస్వతీ దేవిపై వ్రాసిన కవితల సంకలనము)



# శ్రీ ప్రసన్న భారతి

విషయసూచిక

# శ్రీ ప్రసన్న భారతి

## అవతారిక

ఈ కవితా సంకలన మొక అపూర్వ గ్రంథము. కవులు వారి వారి యిష్ట దైవములపై వ్రాసిన శతకములే కాదు బృహద్గ్రంథములును పెక్కు లున్నవి. ఇది ఒకే దైవముపై ఈనాటి పలువురు కవులు వ్రాసిన కవితా మంజరి; శ్రీ సరస్వతీ స్తోత్రలహరి.

ఒకనాటి పూజా సమయము. ఆనాడు నాధ్యానమంతయు శ్రీ సరస్వతీ దేవి విగ్రహముపై నిలచి ఒక తలంపుదయించినది. నలువురైదుగురు కవులచే ఆ దేవిపై పద్యములు వ్రాయించి, ఏటేట మా యింట జరుగు సరస్వతీ పూజా దినమున ఒక చిఱుకబ్బముగ ఆయమ్మకు సమర్పింపగలిగినచో బాగుండునని; వ్యయప్రయాసల మాటనటుంచి పెద్దలగు ఇద్దరు ముగ్గురితో ఈ విషయము సంప్రతించితిని. వారందఱు ఏకగ్రీవముగ తెలిపిన శుభాకాంక్షల ప్రోత్సాహ బలముతో నాకు పరిచయము గల కొందఱు కవులకి విషయమును తెలుపుచు విజ్ఞప్తి నంపితిని. విలంబనము లేక వెంట వెంటనే తెలుగుసీమ నలుదెసల నుండియు ఆ కవుల రచనలు వచ్చినవి. సంస్కృతాంధ్రములలో ఛందోబద్ధములు సంప్రదాయ సమంచితములైన నూతన కవితా ప్రసూనమాల్యములవి. సర్వము ఆ చదువుల తల్లి అనుగ్రహమని ఆనందభరితుడనైతిని.

ఆ భారతీదేవికి దాదాపు ఏబదిమంది కవులు సమర్పించిన పద్య ప్రసూనోపహారము లివి. ఆ వ్రాసిన పండితులు కవులు ఎవరు? వారిలో ఆచార్యవర్యులు వేదవేత్తలు వ్యాకర్తలు మహా పౌరాణికులు కళాప్రపూర్ణులు అష్టశతావధానులు, శతాధిక గ్రంథకర్తలు, సువర్ణ గండపెండేర విభూషితులు ప్రఖ్యాత బిరుదాంకితులు, ఎమ్.ఏ, పి.హెచ్.డి. పట్టభద్రులు కవయిత్రులు జంటకవులు కవిపండిత పరిషత్ సమ్మానితులు ప్రభుత్వ సత్కార గృహీతలు, యువ రచయితలు మున్నగువారున్నారు. ఎందఱో మహానుభావులనిన నుడికి సత్యసుందరమైన ఉదాహరణమీ కలయిక. ఎవరి కవితారీతి వారిది, ఎవరి వర్ణన వారిది, ఎవరి భావన వారిది, ఎవరి భక్తితత్పరత వారిది. వారి వారి లేఖినుల నుండి ప్రసరించిన రస తరంగిణీ ఈ కవితా సంకలనము.

ఈ వైవిధ్యములో అంతర్గత జ్యోతిగా నున్న జ్ఞానరసాకృతి సకల విద్యాధిష్ఠాన దేవత త్రిజగదారాధ్యయగు శ్రీ భారతీస్వరూపము సుప్రసన్నము సుస్పష్టమై ప్రకాశించుచున్నది. స్వయంప్రకాశమానమగు ఆ అర్చారూపమే ఈ "ప్రసన్న భారతి". కరుణాదర మృదు మధుర హాసన్ముఖియై యా మహాదేవి ఈ సాహిత్యోపాసకుల పద్య పూజలు స్వీకరించుచున్నది. ఆ వాల్మీకుల నాటినుండియు నిర్విరామముగ కవితాపూజలందుకొనుచున్న జగన్మాత శ్రీ సరస్వతి కీకవుల రచనలు నూత్నాలంకృతులు.

మఱియొక మాట. గ్రంథపరిమాణమును బట్టి కొందఱి రచనలనుండి కొంత భాగము తగ్గింపవలసి వచ్చినది. కొందఱు కవులు తమ పద్యములలో నా పేరును గూడ ప్రశంసాపూర్వకముగ చేర్చి వ్రాసిరి. వానిని గూడ తగ్గించితిని. కవి సుహృద్వరులీ మార్పులను సహృదయతతో గ్రహించగలరని విశ్వసించుచున్నాను. ఏవియో ఒకటి రెండు విషయములలో తక్క తక్కు రచనలు చేరగనే ముద్రణ కందించుచు వచ్చితిని. ఈ కవి వరుల స్వహస్త లిఖితములు అమూల్యములైన ఈ రచనలన్నిటిని ముద్రణమైన తరువాత మరల సేకరించి భద్రముగా నుంచితిని. ఈ గ్రంథ నిర్మితికి, ఆవిష్కృతికి నాకు చేదోడు వాదోడైన వారికెల్లరకు నా కృతజ్ఞతానేక వందనములు.

పరిమాణమున చిన్నదయ్యు మహిమయందు పెద్దయనదగు ఈ గ్రంథమును ఆంధ్ర ప్రజానీకమాదరించి శ్రీ ప్రసన్న భారతి అనుగ్రహమునకు పాత్రులు కాగలరని నా ఆశ.

విశాఖపట్టణము
విభవ ఆశ్వయుజము
16—10—88

సంకలన కర్త

ఆచార్య, విద్వాన్. శ్రీ దివాకర్ల రామమూర్తి, ఎమ్. ఏ

"యాదుగ్ధాపి న దుగ్ధేవ కవిదోగ్ధృభి రన్వహమ్
హృది నః సన్నిధత్తాం సా సూక్తి ధేను స్సరస్వతీ"

కవులనెడి పాలు పితుకువారిచేఁ బ్రతిదిన మవిరతముగాఁ బితుకబడు చున్నను, ఎప్పటికప్పుడు, పాలు పితుకఁబడనిదానివలె, నెయ్యది భాసిల్లి (తత్తత్కవుల అర్థతనుబట్టి) పాలిచ్చునో ఆ సరస్వతీరూప సూక్తి ధేనువు (కామధేనువు) మా హృదయములయందు సన్నిధానము చేయుగాక.

అది ప్రసన్న భారతి. భారతి 'భావాంబర వీథ్రిత విహారిణి' తద్హృదయము నవ్యనవనీతము. తద్వాత్సల్య మనుపమము. శ్రిద్ధాయుక్తుఁడై కవి యామె నాశ్రయించవలయును. ఆమె సుప్రసన్నయై సూక్తిమరంద ధారలను గ్రుమ్మరించుసు. తదాస్వాదమున కవులు రచనావేశము నొంది మధుర కావ్యస్రష్టలగుదురు. ఆమె కృపాదృష్టి లేనిదే కవి కవి కాడు. కవిత్వము హృదయంగమము కానేరదు. తత్కవితా శారదా రూప మక్షరము. అది రసమధురము. ఆనందచిత్రకల్పనము. అట్టి భారతికి అపూర్వ సుమనస్స్రజ్జేయ రూపమీ అనిదంపూర్వ కావ్యము.

సుకవితా మహాసామ్రాజ్యరాజ్ఞీమతల్లి భారతి కిది యొక యపూర్వ భూష. రచయితలందరు కవులు, కవితాభ్యాసచణులు. ప్రాచీన ప్రబంధ సంప్రదాయజ్ఞులు. భాషాయోషా సేవా నిరతులు. తలంచిన ఒక్కొక్క రొక్కొక్క మహాకావ్యమును సరస్వతిపై రచింపగల దిట్టలు. తమ యుపాస్య దైవతమయిన భారతింగూర్చి పద్యోపహారమును యధేచ్ఛముగా రచించి సమర్పించిరి. ఆ పద్య సుమనోమంజరులకు ప్రసన్నభారతీ స్వరూప మొసంగిన కవితాప్రియుంభావుకులు మిత్రులు మధుర కవులు, బహు సద్గ్రంథ రచయితలు నయిన శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు వాఙ్మయ తపస్సుచే ధన్యులే కాదు, సారస్వత కేదారనిరంతర కృషీవలులకు పూజ్యులు కూడనైరి.

సరస్వతీ పూజోల్లేఖాలంకారమయిన ఇట్టి కావ్య సంకలనము చేయవలయునని సంకల్పముదయించుటయే యొక పూర్వజన్మ కృత పుణ్యము. ఈ కావ్యమునకు అధినాయకురాలు సరస్వతి. ఆ సరస్వతీ విన్యాసములనంత

మధురఫణితి శోభానీతము లనేకములు. పద్యరచనా విశిష్టులయి, అనన్య ప్రతిభోత్పత్తుల కాకరులయిన ప్రాచీన కవివతంసుల క్షుణ్ణమార్గములిందు భాసిల్లినవి. ప్రబంధ సరస్వతీ పాదనూపుర ఘలంఘలలు వెయ్యి మధుర శ్రుతుల నిందు రవణించుచున్నవి.

కవిత్వమున కిది యొక్కటియే మార్గమని లేదు. ప్రసిద్ధులైన కవులెందరెందరుండిరో యన్ని యపూర్వ ప్రతిభా ప్రతిబద్ధ మార్గములున్నవి. ఈ సరస్వతీ ప్రసన్నతకు సహకరించిన కవులు లబ్ధ ప్రతిష్ఠులు. కళావిరాజితులు. బంధురకావ్యశైలీ నిష్ణాతులు. సాధిత శబ్దలక్షణ శాస్త్ర మహోదధులు. వారి భావార్ణవజాత రత్నసముదాయమీ పద్యమణి సంకలనము. ఇట్టి అనిదంపూర్వ కవితా సంకలనము చేసిన శ్రీ సుబ్బారావుగారు కావ్య తపస్వులు. నిర్మత్సరులు. సహృదయ శిఖామణులు.

శ్రీ తెన్నేటి విశ్వనాధ సంస్థాపిత మీ విశాఖ సారస్వత వేదిక. ఈ వేదిక కావ్యపురాణ శాస్త్ర కల్పకచ్ఛాయా పునీతము. ఆ విశ్వనాధ కావ్య మనీషాతపస్సు నిత్య నవపారిజాతమయినది. కవి భావుక మానస సరోవరమయినది. ఆ మానస సరోవరమున చంద్రచంద్రికాద్యుతుల వెదజల్లుచు ప్రసన్నమైన దీ ప్రసన్న భారతీ హంసము.

భారతమును కవిత్రయమనువదించిన పిమ్మట నెందఱో మరల వ్రాసిరి. అట్లే పోతన్న భాగవతము ననువదింప నెందఱో ఆ కథా వృత్తమునే గ్రహించి రచించిరి. అంత మాత్రమున రచనకు న్యూనత రాదు. బహుకవి కవితాభావుకత్వ ఫణితులు ప్రత్యక్షమై ఆనందమొసంగును.

వస్తువు 'భారతి'. భావుకులయిన కవు లనేకులు. వారి వారి భావనా విన్యాస వైవిధ్య విశేష విలసిత మీ కావ్యము సహృదయానందమును సమకూర్ప సమర్థము.

సారస్వత వేదికా మధురకవియై, బహురచనా విశిష్టుఁడై యొప్పియు, ఈ "విభవ" వత్సర నవరాత్ర్యుత్సవ సమయ సరస్వతీ పూజావసరమున ఇట్టి కవితా సుమనోమాలను సంకలనము చేసి సరస్వతీగళసీమ నలంకరించి, సమకాలీన కవి వతంసులతో కూడి అక్షర శారదాపూజ చేయు శ్రీ సుబ్బారావుగారిని శ్రీ సరస్వతి ఆయురారోగ్యైశ్వర్యములొసంగి, మధుర మహాకావ్య రచనా దీక్షితుని చేయువలయునని ప్రార్థించుచున్నాను.

# శ్రీ సరస్వతి ప్రార్థన—దండకము

శ్రీ మన్మహాదేవి వాణీ కృపావర్షిణీ, వేదవేదాంత సంచారిణీ, లోక కళ్యాణ సంధాయినీ, నిత్య సౌహిత్య సాహిత్య సంవాసినీ, శారదా స్వచ్ఛ రాకామనోజ్ఞద్యుతీ భారతీ, సర్వ విద్యామహారాజ్ఞి! విజ్ఞానమూర్తీ, భవత్పాద నీరేజ నిత్యార్చనాధీన భక్తాళికిన్ భుక్తిముక్తిప్రదా శారదా, నీకివే భక్త్యం జులుల్ స్వీకరింపంగదే.

విశ్వ సంవ్యాప్త శబ్దాకృతీ, సర్వశుక్లా, శిరోన్యస్త కోటీర రత్నప్రభా శోభితాశాతటా, నిత్యకారుణ్య రేఖామృతాసార వీక్షాంచితా, మందహాసామల శ్రీ విలాసోరు బింబాధరా, సర్వ సర్వం సహారక్షణోదారదీక్షాప్రసన్నాననా, శుభ్రవస్త్రాన్వితా, హారిముక్తామణీ భూషణాలంకృతీ, వజ్రవీణా సమాయుక్త హస్తాంబుజాతా, రణన్మంజుమంజీర సంశోభితాంఘ్రిద్వయా, సర్వలోకైక సంస్తూయమానాకృతీ సత్కృతీ, పద్మపీఠీవిరాజత్ సుధీసుందరాకార తేజో మయీ.

శ్రీ హరీశాన పద్మోద్భవుల్ నీ మహత్త్వమ్మె కీర్తింప, ఇంద్రాదిసర్వా మరుల్ సర్వ యోగీంద్రులున్ నిన్నెకై మోడ్చి పూజింపగా, ప్రాంచదుద్య న్మహాశక్తి మద్దివ్య బీజాక్షరి మంత్ర పారంపరల్ నిన్ను సేవింపగా, సర్వ విజ్ఞాన శాస్త్రార్థరూపమ్ము నీవై విరాజిల్లుచున్, పద్మ సంభూతుడౌ బ్రహ్మదీక్షా తపస్యన్ కడున్ మెచ్చి లోకమ్ములన్ సృష్టిగావించు ధీశక్తి యుక్తుల్ ప్రసాదించుచున్ తన్ముఖాబ్జమ్ములందున్ నివాసమ్ముగానుండి, సావిత్రి గాయత్రియున్ నీవుగా, సర్వ దిగ్దేవతామూర్తివై, సర్వయోగీంద్ర హృద్గోచ రానంత శక్తి స్వరూపమ్ము నీవై, సదానందరూపా చిదానందదీపా, త్రిలో కమ్ములందున్న జ్ఞానప్రభాజాల సర్వస్వమున్ నీ ప్రధానాంశయై వెల్గ, వీణా కరాబ్జాతవౌచున్ కళారాధకశ్రేణి కారాధ్య దైవమ్మువై, మోక్షమున్ గోరు భక్తాళికెల్లన్ నిరాకార చిద్రూప తేజమ్మువై సత్కృపామూర్తివై పొల్చు నీ శక్తి వర్ణింపగా నీ మహత్త్వమ్ము నూహింపగా మాకసాధ్యమ్ములో తల్లి.

నీ చేతులందున్న నీరేజ కావ్యాక్షమాలా శుకమ్ముల్ కృపాభిక్షగా మాకు జ్ఞానమ్ము సాహిత్య మధ్యాత్మనిధ్యానమున్ వాక్సుధాస్వాదురీతుల్ ప్రసాదించుగాతన్, భవత్పాద మంజీర నిక్వాణ వైదుష్యముల్ మా మనశ్శక్తి మేల్కొల్పుగాతన్, భవత్కచ్ఛపీ నాద సమ్మోదముల్ వేద సారమ్ములై కావ్య మర్యాదలై వాగర్థతత్త్వప దేశమ్ములై మమ్ము పాలించుతున్,

నిత్యమున్ నీ దయా వీక్షణాలబ్ధ సంరక్షకున్ మా శరీరమ్ములత్యంతమున్ పాత్రమై, శారదా బీజమంత్రాక్షరోచ్చారణ శ్రీ ఫల ప్రాప్తికిన్ మాదు చిత్తమ్ము సంస్థానమై మా మనోదేహ సంభాషణమ్ముల్ భవత్పాద పూజా ప్రసక్తమ్ములై సర్వ మీ లోక మన్యోన్య విద్వేష దోషమ్ములన్ వీడి శశ్వత్ శుభాధిక్యముల్ శాంతి సౌభాగ్య సౌజన్య సౌఖ్యమ్ములన్ గల్గి వర్ధిల్ల నీ సుప్రసన్నాస్యమందస్మితా సారముల్ మాపయిన్ నింపి నీ సత్కృపానేక వీక్షామృతాసేకముల్ మావయిన్ పర్వి, నీ పాద రమ్యారుణశ్రీలు మాశీర్షముల్ సోకి కాంతిల్లగా జేసి, భాషామహాదేవి నీ దీవెనల్ గొల్పి, సత్కావ్య నిర్మాణ శక్తుల్ ప్రసాదించి నిత్యమ్ము మమ్మేలుమో మాత, నీ దాస దాసీ జనమ్మేము తల్లీ జగత్కల్పవల్లీ, జయశ్రీ ప్రదాత్రీ శుభశ్రీ భాగ్య సంపత్ప్రదా శారదా భారతీ విశ్వవాణీ నమస్తే నమస్తే నమః.

శ్రీ

# ప్రసన్నభారతి



దేవీ! నీ పదపూజలీ కవిత లర్థిన్ భాసిలుంగావుతన్

మాత్రే నమః

# శ్రీ సరస్వతీ దేవికి

## కృతిసమర్పణ పద్య ప్రసూనాంజలి

శ్రీ విభ్రాజిత శుభ్ర శారదిక చాంద్రీ పుణ్యకాలమ్ము లం
దావిర్భూత మహోత్సవ ప్రకట పుణ్యారంభముల్ వచ్చె వా
గ్దేవీ; నీ పదపూజ లీ సుకృతు లర్థిన్ భాసిలుంగాక మా
భావోద్యాన వచః ప్రసూన సురభి వ్యాపార రమ్యమ్ములై.

నవరాత్రి వ్రత దీక్షితాత్ములు జగన్మాతా! భవద్దాసు లీ
కవులీనాడు గళమ్ములెత్తి రసవత్కావ్యోదయ శ్రీ మహో
త్సవ సంపన్నముగా వచింతురిదె భాస్వద్రమ్య మీ సాహితీ
సవన ప్రాంగణమందు నీ పృథు యశస్సంగీత సంకీర్తనల్.

అభ్యర్థించితి నీకవివ్రతతి నంబా వీరు విద్వత్ కవి
శ్లాఘ్యాస్యప్రతి భాఢ్యులాంధ్ర దివిషద్భాషాకవి స్వాములున్
సభ్యత్వమ్మున నీ పదాబ్జ పరివస్యాపుష్ప సౌందర్య సౌ
రభ్యమ్ముల్ వెలయించి రీ కృతు లుదారప్రీతి గైకోగదే.

నేనై చేసిన దేమియున్ దుదకు లేనేలేదు, నీపాద పూ
జానందోత్సుకు లీ కవీశ్వరులు తోడై వచ్చి యర్పించి నా
రీనిర్వేల సుగంధ బంధురములౌ ఈ పద్య మాల్యమ్ము లం
బా! నీ దివ్యకృపా కటాక్షరస భిక్షాభ్యర్థులై భక్తులై.

ఈ కైతల్ భవదీయ కీర్తిసుషమా హేవాకరేఖల్, శర
ద్రాకాపూర్ణ శశాంక చంద్రిక లుదాత్తప్రౌఢ సాహిత్య వి
ద్యాకీర్ణములు, దేవతావనలతాంతస్వాదు సౌగంధ్యముల్
స్వీకారార్హములై విరాజిలుత దేవీ నీకు హృద్యమ్ములై.

సారోదాత్త మనీష నీచరణ పూజాధుర్య విద్యావయః
పారావార విహారు లీకవులు నిన్ వర్ణించి కీర్తింతు రీ
ధారాపాత వచస్సుధాఝురుల నీ దాక్షిణ్య వీక్షామృత
శ్రీ రమ్యాశిష వాగ్విశేషముల పేరిం దల్లి ప్రోవంగదే.

ఆశాదీపిత నూత్న కౌతుక మహాహ్లాదమ్ములై పొల్చు మా
యాశబ్దార్చన లీమనోజ్ఞ కవితాహేలామధుశ్రీలు నీ
యాశాస్యమ్ములు దేవి! ఈపగిది కావ్యానంద నిష్పంద భా
షా సంపన్నము జేసి మా బ్రతుకు లాజ్ఞామూర్తి పాలింపవే.

శరణము నీవె తల్లి కవి సంతతికెల్ల, భవత్పదార్చ నా
చరణము సంతతాభ్యుదయ సంపద, నీ మృదుహాస భాసుర
స్ఫురణము జ్ఞానకాంతిమయ బోధము, నీ కరుణావలోకనా
దరణము మాదు జీవనపు దారుల వెల్గులగున్ సరస్వతీ.

కర్ణశ్రావ్య వచోఽభిరామ కవితా గంగానదీ స్వాదు వాః
పూర్ణమ్ముల్ నవపద్యహేమ కలశమ్ముల్ నింపి భాషార్ణ వో
త్తీర్ణుల్ సత్కవులేగుదెంచి రిటకీ దివ్యత్ సుధీసాహితీ
స్వర్ణస్నానము లంది మమ్మేలుమి భాషాదేవి దీవింపుమా.

సంకలన కర్త

కొండేపూడి సుబ్బారావు

శ్రీరస్తు

# ప్రసన్న భారతి

✲✲ ✲✲ ✲✲

## వందే జగన్మాతరమ్


ప్రాచార్య – మధురవచస్వి

ప్రొఫెసరు: శ్రీ యస్వీ. జోగారావు, ఎమ్.ఏ; పి.హెచ్‌డి. డిలిట్ (హానరరీ)

నేషనల్ ప్రొఫెసరు, తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వవిద్యాలయము


కాలముకన్న మున్ప్రొడమి కాలమునే కడుపారగాంచి యా
కాలమె యాత్మరూపముగ గ్రాలుచు జాణతనంబునన్ జగ
జ్జాలము నింద్రజాలమును జాతరమేల మొకప్పు డల్లక
ల్లోలము జేయు నా సకల లోక సవిత్రికి సాధువాదముల్!

కాలము కన్నతల్లి కడ కంట తళుక్కను చిత్రచిత్కళా
లీలను కాంతిహేల నమలీమస మానవజాల మానసా
భీల మనోహరాకృతి నవేల దయాప్రకృతిన్ జగద్ధిత
శ్రీ లలితాధరస్థిత శుచిస్మితమున్ భజియింతు భక్తిమై.

వాక్కర్త్రీ! జననీ! భవత్కరుణ కావ్యశ్రేణి నిర్మించితిన్
లెక్కల్మీరిన దేశదేశముల నీ లీలాకృతుల్ స్త్రీల ప్ర
త్యక్షమ్ముప్రకృతిప్రవృత్తులను కావ్యస్థం బొనర్తున్ భవ
ద్దిక్కూలంకషదివ్యదీధితి గిరాందేవీ! ప్రసాదింపవే!

# అమరవాణి

"కరుణశ్రీ"

కళాప్రపూర్ణ శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి, ఎమ్. ఏ

ఏ వాణి వేదశాస్త్రేతిహాస మహాబ్ధి
మందారవల్లియై కందళించె
ఏ వాణి వాల్మీకి హిమగిరీంద్రమునుండి
గంగా ప్రవంతియై పొంగి పొరలె
ఏ వాణి వ్యాసమునీశాన గళ ఘనా
ఘనవర్షధారయై ఘనత కెక్కె
ఏ వాణి కాళిదాసేందు బింబము నుండి
నిండారు పండు వెన్నెలలు గురిసె

అయ్యమరవాణి హంసవాహనుని రాణి
విశ్వకళ్యాణి వీణా ప్రవీణ పాణి
తియ్యనగు తెల్గువాణితో వియ్యమంది
నాదు వాక్కుల నటనం బొనర్చుగాక!!

— x —

# కళ్యాణ శారద

"కరుణశ్రీ"

సదానందరూపాం చిదానందదీపాం
శరచ్చంద్రవర్ణాం రసశ్రీ ప్రపూర్ణామ్।
ఉదాత్తాం సువృత్తాం కృపాయత్తచిత్తాం
ప్రసన్నాస్యబింబాం భజే శారదాంబామ్॥

శతానందజాయాం సతాం శ్లాఘనీయాం
త్రిలోకైక పూజ్యాం సుధీప్రాజ్యరాజ్యామ్।
సవిత్రీం సుగాత్రీం జయశ్రీ ప్రదాత్రీం
ప్రసన్నావలంబాం భజే శారదాంబామ్॥

గృహీతాక్షమాలాం త్రిలోకైక మూలాం
స్ఫురన్మందహాసాం సుధాసింధువాసామ్।
ఉదారాం సుహారాం నవోల్లాసపూరాం
ప్రసాదావిలంబాం భజే శారదాంబామ్॥

కళాసు స్ఫురంతీం కటాక్షాన్ కిరంతీం
కళంకం హరంతీం కలం వ్యాహరంతీమ్!
ప్రశాంతాం సుకాంతాం ప్రదీప్తాగమాంతాం
విపంచీ విడంబాం భజే శారదాంబామ్॥

సువర్ణాంచితాంగీం సులావణ్యభంగీం
పురః కల్పవల్లీం పురంధ్రీమతల్లీమ్।
పురాణీం సువేణీం దశత్పద్మపాణీం
స్మితశ్రీ కదంబాం భజే శారదాంబామ్॥

— × —

# "సర్వశుక్లా సరస్వతీ"

మహాకవి, సాహితీ సమ్రాట్, కళాప్రపూర్ణ
శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి.

ఎది! యేదీ! యొకసారి యొక్కపరి తల్లీ! చల్లనౌ నీదు కన్
తుద శోభారుణిమంబు చిందు మదె విందుల్వోయు నాబోటి క
ర్మదరిద్రాయకు నోట నీకినుకచాలల్ గుర్తుగా నమ్రతన్
ముదమారన్ భవదంఘ్రులం దడవికొందున్ సర్వశుక్లా కృతీ!

కనరా దెచ్చుటనేని నీవదనభాగ్రచ్ఛాయ నెట్లాశ్రయిం
తును దల్లీ! కనులుండి గ్రుడ్డినయిపోదున్ నీవళక్షంపు వె
ల్గును లక్ష్యంబుగ నిల్పఁజాలని పరాకున్ నాకుఁ బోఁజేసి చి
ద్ఘన చింతామణివెల్గు నీయఁగదె! మాతా! వేదశృంగస్తుతా!

వెలిదమ్ముల్ నెలరేలు మల్లెవిరులున్ బెంపారు ముత్యాలపే
రులు క్రొమ్మించులు మంచుపొంగులును నీరూపంబుగానెంచి, క
న్నులలో వత్తిడుకొంచు నిన్నుఁగనుఁగొందున్; నీవదాబ్జాతరే
ఖలు మత్ఫాలతలంబు సోఁకి యెఱుపెక్కన్ జక్క దీపింపవే!

అనలేకుండఁగలేను నేలవిడిసామా! సామగానైక మూ
ర్ఛన లోలాచ్ఛరుచి స్ఫుటాస్ఫుట సమంచత్స్ఫోట నాదానువ
ర్తనమూర్తీ! జనయిత్రి! త్వచ్చరణ పద్మశ్రీగళన్మాధ్వి చి
ల్కన నాయెఁదల పండి యెన్నటికి నాలో నిన్ను మన్నింతునో!

జననీ! నాకుఁగలట్టి దొక్కఁడె యభీష్టం బద్ది ముద్దాడఁది
ర్పిన నీజన్మకుఁ జాలు మంగళపవిత్రీ! వీఁడు గొంతెత్తి పి
ల్చినకబ్బంబున నీదు మందహసిత శ్రీచారుగంభీర గుం
ఫన దివ్యాకృతి పల్లవించునటు లమ్మా, పల్కుమా, గీరమా!

నీతత్త్వాంబుధిలో మరందకణమేనిన్ నాల్కఁ జిందించుకో
నైతిన్; నేనొక కోవిదుండనని సర్వాంధ్రావళీ ప్రీతికిన్
గైతల్ చెప్పెద నన్న వట్టి యవివేకగ్రంథియున్ విప్పికో
నైతిన్; గప్పిన జీవలక్షణపు చర్యల్ నీకు క్షంతవ్యముల్.

— × —

# సరసవాణి—ఛందోవాణి

శ్రీ చర్ల గణపతిశాస్త్రి

బ్రహ్మముఖంబునం దమృతవాహినివై విశదంబు నొందియా
బ్రహ్మఋషి ప్రశాంతవిమలాశ్రమవాటి మెఱంగి సత్కవి
బ్రహ్మల మోముఁదమ్ముల సరస్సులలో రసకేళిఁ దేలు నో
బ్రాహ్మిరో! యార్యసూక్తిరసపావనివై విహరించినావహో.

అటులఁ బావనివౌ నీవు నడఁగి యుడఁగి
ఏల దిగజాఱియు దిగంబరాలఁ దాల్చి
విప్లవము రేపుచుంటివి వేగ మాపు
కలహముల మానుపు మశాంతిఁ జలుపుదేల?

అమల ఛందోవాణివౌ నీకు ఛందసుల్
చెఱసాల లయ్యెనే చెప్పుమమ్మ!
సాధువాదాలతో స్వర్గంబు నిడెడి నీ
వపవాదముల తోడ నాడె దెట్లు
ఉత్తమశ్లోకుల యున్నతకథల వే
సరి పోయి సంతబజార్లఁ బడితె
పలుకుటయే రాని పామరుఁ బైకెత్తు
మీవిటు వికట రూపేల దాల్తు

నాల్గుముఖంబులన్ నళిననాభునివట్టి వెలుంగుచుండగా
నాల్గు తనూవిశేషముల నాతి! వెలుంగుదు వీవుఁగూడ నా
నాల్గుముఖాంబుజంబులు గ నంబడుచుండును గాని లోపలన్
వెల్గెడు నీదుమూర్తు లల విప్రులకే గనిపించు, భారతీ!

ధాత్రివి, సర్వలోకహిత దాత్రివి, మాన్యజనాభిలాష సం
ధాత్రివి, భక్తలోకభవ దాత్రివి, దానదయాదిసద్గుణో
న్నేత్రివి, నిర్మలాంగరుచి నిర్జితశీతమయూఖరేఖికా
భర్త్రివి, చారుగాత్రి వజభాగ్యవివర్ధిని వమ్మ భారతీ!

మంజులవాగ్విలాస! సుర మాన్యసుపూజిత దివ్యదేహ! యో
కంజ దళాక్షి! చారుముఖ కంజ వినిర్జితచంద్ర! వైఖరీ
పుంజ వినోది తామర మ్ముఖాదిక దేవనికాయ! చారుహృ
ద్రంజిత పంకజోదరసుతా! సుముఖాసుర మూర్తి! భారతీ!

ఆడెదు సత్యవాక్యముల నాడె దసత్యవచో విలాసముల్
పాడెదు కూనిరాగముల బాడెదు శాస్త్ర వినిశ్చితార్థముల్
గూడెదు కూళకర్మకుల గూడెదు ధీరకవీంద్రవారమున్
చూడఁగ నీదు చర్య లవి చొప్పడునే వచియింప, భారతీ!

ఓం తత్సత్

# శారదాస్తవమ్

## (వసంత తిలకము)

'సువర్ణగండపెండేర విభూషిత' 'కవితావాచస్పతి'
'భాగవతప్రవచనాచార్య' 'ఆచార్య శిరోమణి' 'విద్వత్కవిరాజ'
డా॥ చేబోలు చిన్మయబ్రహ్మకవి ఎమ్.ఏ. పిహెచ్.డి.

శ్రీ వందితే! సురమహేంద్ర సమర్చ్యపాదే!
శర్వాణి! లోకనుత భావవిలాస జాలే!
ఆనందదాయిని! కవిత్వపటుత్వదాత్రి!
శ్రీ శారదే! విజయదే! శుభదే! భజామి

వీణాధరే! నవమనోజ్ఞ కరాంబుజాతే!
బ్రహ్మణి! మానససరోవిహరన్మరాళే!
విద్యావిధాయిని! కళామయి! రాగరమ్యే!
శ్రీ శారదే! విజయదే! శుభదే! భజామి

దుర్గావతారిణి! భవాని! దయాప్రపూర్ణే!
భక్తాభయప్రద వచోఽమృతపూర్ణచిత్తే!
క్షీరాబ్ధిజాతసుకుమారి! కుమారధన్యే!
శ్రీ శారదే! విజయదే! శుభదే! భజామి

సంసారహారిణి! సువర్ణ విశిష్టగాత్రి!
కార్యానుకూలిని! కవీంద్రకృతిప్రమాణే!
బ్రహ్మాంతరంగనిలయే! శరదిందుమూర్తే!
శ్రీశారదే! విజయదే! శుభదే! భజామి

శక్తిప్రదే! మధురకావ్య కళానిధానే!
మాతః, జగన్నుత సమస్తవిభూతి గమ్యే!
సంరక్ష! రక్ష! భవదీయపదాశ్రితం మామ్
శ్రీ శారదే! విజయదే! శుభదే! భజామి

— x —

# ప్రసన్న శారద

ఆచార్య, విద్వాన్ దివాకర్ల రామమూర్తి ఎం.ఏ
రిటైర్డు ప్రిన్సిపాల్, ఏ.వి.యన్. కాలేజి, విశాఖపట్టణము.

కమలభవు చతుర్ముఖీ ప్రకాశమాన
కంఠశృంగాటకాన, నిగమనిచయ, ని
రతవిహారిణీ! సుప్రగల్భ రుచిరార్ద్ర
మృదులవాచాలరో! సరస్వతీ! నమస్సు.

కచ్ఛపి చేతఁబట్టి మృదుకంజ కరాగ్రనఖాహతిన్ స్వర
స్వచ్ఛత దివ్యకంఠపరిసర్పిత ధీరమనోజ్ఞరాగ స
ర్వోచ్ఛత 'హంస'నాదవర'మో'oకృతి కాస్పదమై జగత్త్రయీ
హృచ్ఛుభబాధ బాపు జగదీశ్వరి శబ్దమహేశ్వరీ నుతుల్.

నాకేమో లలితాభవానియు, జగన్మాధాఖ్య కళ్యాణి ల
క్ష్మీకాంతామణి, నీవు నొక్కరయి ప్రజ్ఞైద్యంపు రూపాద్భుతిన్
ప్రాకట్యంబు వహించి తోచెదరు మాద్వైతంపు సాక్షాత్కృతిన్
ఓ కళ్యాణి! రసోదధుల్ వెలయు నేత్రోన్మీలనాచ్ఛద్యుతిన్.

సౌందర్యమ్ము భవన్ముఖప్రభల నాశావీథి పొంగెత్తి స్వా
నందోజ్జృంభణగాంగభంగములుగా నాట్యంబు సల్పంగ, హృ
త్స్పందమ్ముల్ జనియించి, శబ్దగణమై బ్రహ్మాండహృణ్మండలిన్
బొందుల్ గూర్చును సర్వవాఙ్మయముగా మోద మ్మనంతంబుగాన్.

కవిబ్రహ్మల్ భవదీయపూజలను బ్రహ్మకాంతైక దర్శిత్వసం
భవు లైనారు; రసాంబుధుల్ దరచి తత్త్వామృతస్వరత్నౌఘసం
భవి దీపింపఁగఁ జేసినారు; జగతీ సారస్వత శ్రీకళా
ప్రవణమ్ముల్ భవదీయనూపురఝణారావంపు వైదుష్యముల్.

వదమె త్తన్ నిగమార్థసౌరభము శుంభద్వ్యాఖ్యలంజేయు, ని
ర్ఘద భాషాంతర ధీస్మృతి ప్రకరవార్ధుల్ క్షేమమార్గంబులై
యుదితామ్నాయరహస్య తంత్రముల సంయోగించు పౌరాణ సం
పద(గీర్తింప(గ, నిత్యనవ్య విభవ వ్యారూఢముల్ నీ కృతుల్

ధర్మమార్గోన్నత మర్మభాష్యంబులు
త్వత్సాధకీరపరివాదసరణి;
శ్రుతిరమా సీమంత శోణసిందూరముల్
ఉపనిష ద్రత్నకాంత్యుజ్జ్వలములు;
భవదీయ శృంగారభవన సంగీతముల్
సామగానసుధా ప్రసాధనములు;
ఋషి కవీంద్ర ముఖరితేడ్య కథాసూక్తి
వేదాంతబృంహ ణాస్వాదనమ్ము;

సర్వశబ్దసంస్కారవిశ్వం బదెల్ల
యుష్మ దాహ్లాద సల్లాపనోదయమ్ము;
ఓ! సరస్వతీ! శబ్దరూపోజ్జ్వలతను!
ఎంత యధమర్ణులము, నీదుకృపకు మేము

త్వద్దివ్యసారస్వతం బుపాసింతును
మోహాంధతమసమ్ము ముగియు కొఱకు;
అక్షరశబ్దార్థ మారాధనము సేతు
అజ్ఞానతిమిరౌఘ మణ(గు కొఱకు;
బహుశాస్త్రబంధుర వాఙ్మయమ్ము గణింతు
దివ్యమానవత సంధించు కొఱకు;
మధురమనోజ్ఞసామ్రాజ్యమౌ ఋషిసూక్తి
తలదాల్చెదను ముక్తి తనరు కొఱకు;

శారదా! శారదాంభోజసారవదన!
తద్వదనసరోజ సురభివాత నిచిత
సర్వసాహిత్యసౌందర్యసత్త్వ మెఱు(గు
నీదు సన్నిధి సర్వసన్నిధి యొనర్చు.

ఏనీప్రసాదమ్ము పూని కవీంద్రులు
భువనతలంబెల్ల భూరిప్రజ్ఞ
కరబదర సమము గావించి దర్శింత్రు
సర్వార్థముల మునీశ్వరుల యట్లు!
ఏనీ కృపామసృణేద్ధ కటాక్షపా
తాదృతిని, జని ధన్యత వహించు;
ఏనీ తనూవల్లి యెనలేని భాసమ్ము
క్షీరసింధువును దాసీకరించు;

భవదుదారమందస్మితప్రభలు, తల్లి!
శారదేందు ప్రభారాశి చిన్నబుచ్చు;
ఈవు మన్ముఖసీమ వసింతువేని
పుచ్చపూ వ్వెన్నెలల నారబోయ లేనె!

ఈరు తమోహరమైన జ్యోతివి నీవమ్మ
చర్మ చక్షువులకు గోచరవు గావు;
జిహ్వాదురాసద చిద్రస మాధుర్య
మధువాహిని వీవు అసామాన్య వీవు
శ్రవణాంజలి నిపీత శశ్వదాలోచనా
మృతపులకిత తను భృతవు నీవు
సారస్వతార్థి యాచ్నా దైన్యమును బాపు
దీపయోదవు కామధేను వీవు!

ఈ చరాచర జీవ మహేశ్వరివి–ప
రస్పర వచః ప్రథిత కళ్యాణ్యవు నీవు!
శబ్ద చైతన్య శక్తి ప్రస్థాన మీవు!
నీ ప్రసన్నత శాస్త్ర పాథేయమమ్మ

నే నద్వైతిని! త్వత్స్వరూపమును ధ్యానింతున్ త్రయీదేవతా
శ్రీ నిష్ఠా భజనైక తత్పరమతిన్ శ్రీ దేవివై సదా
ధ్యానాంచ త్త్రిరూప సర్వకలనా ద్వైతంపు సాక్షాత్కృతిన్
బూన న్నినె, సరస్వతీ విభవతా స్ఫూర్తిన్ బ్రకాశింపవే.

బాల రసాలసాల నవపల్లవ కోమల మైన తద్వచః
పాలిత ధీమనోజ్ఞరసవన్మధు గీర్వసధమ్ములందు వి
ద్యాలస దూర్మికావళి విహారము సల్పెడు తత్సృతపరిభా
లాలిత మీ జగత్తు సకలమ్ము, కృపామతి నేలు భారతీ!

— × —

# "రాజతే సా సరస్వతీ"

వ్యాకరణ సాహిత్యాలంకార చక్రవర్తి
శ్రీ అప్పల్ల సోమేశ్వర శర్మా ఎమ్. ఏ;

ఓంకారరూపా సకలా సర్వశుక్లా సనాతనీ
సచ్చిదానంద సందోహా రాజతే సా సరస్వతీ॥
అనంతవాఙ్మయాకారా నైకభావరసోదధిః।
ప్రతిభా స్వప్రకాశా చ రాజతే సా సరస్వతీ॥
సువర్ణా సుగుణా రమ్యా సాలంకారా రసోజ్జ్వలా॥
భావహావవిలాసాఢ్యా రాజతే సా సరస్వతీ।
వేదోపనిషదుద్ఘుష్టా విద్యా వేదవిదాం వరా।
మహర్షిసంభావ్యమానా రాజతే సా సరస్వతీ॥
వాల్మీకివదనాంభోజవాసినీ వ్యాససేవితా।
ఇతిహాసపురాణేడ్యా రాజతే సా సరస్వతీ॥
కవిబ్రహ్మప్రియా నిత్యం చిత్రవిశ్వవిధాయినీ!
భావుకానందసంధాత్రీ రాజతే సా సరస్వతీ॥
కవితా కాళిదాసేన భావితా భవభూతినా।
అర్చితా కవిపుష్పైః రాజతే సా సరస్వతీ॥
విశ్వే వివిధరూపాఽపి ధ్వనివర్ణవిభాగశః।
ఏకరూపా భావవశాత్ రాజతే సా సరస్వతీ॥
జ్ఞానవిజ్ఞానసామ్రాజ్యమహాసింహాసనస్థితా।
సర్వలోకైకసందీపా రాజతే సా సరస్వతీ॥

— × —

# శ్రీ శారదాస్తుతి

శతాధిక గ్రంథకర్త, అర్షకవి శిరోమణి,
విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ;

శ్రీ శారదాదేవి సేవింతు భయభక్తి
వాగ్రూపిణిన్ మహావాణి నంబ
గాయత్రి సావిత్రి కమలవాసిని దుర్గ
శ్రద్ధా వినయభక్తి సహితుండ నయి
అక్షరరూపిణి నాది మధ్యాంత వి
హీనను సర్వ విద్యానిలయను
శ్రీవేదమాతను శ్రేష్ఠ హంసారూఢ
నమృత పుస్తకపాణి నంబుజాక్షి
ఏ మహాదేవి లవకృప నేని గాంచి
యెంత జడుండు బృహస్పతి వింతగ నగు
అ మహాశక్తిరూపిణి సౌమనస్య
శ్రీ సరస్వతి నెద నుపాసింతు మ్రొక్కి.

సుందరీజన మహాసౌందర్య మెవ్వరు?
మేధానిధులలోని మేధ యెవరు?
సూర్యుని యందలి సుప్రకాశ మెవారు?
చంద్రుని యందలి చల్లదనము
వాయుదేవునిలోని స్పర్శగుణంబును
దాహకత్వం బగ్ని దైవమునను
సంతోష ముత్సాహ సదమల గుణచయ
మెవ్వారు జ్ఞానంబు నెవరు మిగుల
సాంద్ర మైన యజ్ఞానంబు క్షణములోన
భస్మపటలము గావించు వఱలి యెవరు?
అ మహాదేవి వాగ్దేవి ననవరతము
భక్తిఁ గొలుతు మహానందపదవిఁ గందు.

లేక సరస్వతీకృప నిలింపులునైతము మూగివారలై
చీకటిలోన మ్రగ్గుదురు చెంది రవంత తదీయసత్కృపన్
మూకజనుల్ బృహస్పతులు పొందుగ నౌదురు వాణీసత్కృపా
స్తోకత గన్నసత్కవులె చూ చిరజీవులు ముక్తజీవులున్.

పదములు గావు శాశ్వతము భాగ్యములున్ ధనధాన్యరత్నసం
పదలును గావు భూగృహశుభప్రదయోగము లాత్మజాదిసం
పదలును గావు వాణి దగు భవ్యకటాక్షరసస్రవంతి సం
పదకును మింనుపంపద విభాసిల విందుము నందు నెందునన్.

శ్రీ సరస్వతి రసశ్రీకవిత్వకళాత్మ
ఛందోమయి మనోజ్ఞ స్వచ్ఛరత్న
బహువిధాలంకారవర్గ విభూషిత
ధవళాంగ ధవళాత్మ ధవళవస్త్ర
హంసవాహన చతురాస్య మనోహరి
ఇహపరంబు లొసంగు మహిత దేవి
ఐహికానందంబు నాముష్మికసుఖంబు
నత్యంత మొసఁగెడి యంబ వీణ
పుస్తకంబును తెలివద్మమున్ గరముల
వెలయు సౌందర్య దేవత లలితమధుర
సుందరానన సంతతానందమునను
గరుణఁ జూచుచు న న్నోముఁగాతఁ బ్రీతి.

— x —

# వాగధీశ్వరి

ఆచార్య మానాప్రగడ శేషశాయి, ఎమ్. ఏ;
రిటైర్డు ప్రిన్సిపాల్, ప్రభుత్వ సంస్కృత కళాశాల, విజయనగరము.

చంపక పున్నాగ సౌగంధికామోద రమణీయ వేణీ భరమ్ముతోడ
చంద్రసూర్యప్రభోచ్చయ చకచ్చకిత దిక్తాటంకయుగళీ విధమ్ముతోడ
వదనలక్ష్మీ పరీవాహ చలన్మీనకన్యాభ లోచనకాంతితోడ
మందస్మిత ద్యుతి స్యందమజ్జన్మహాదేవ మానస ముఖదీప్తితోడ

పద్మములనేలు మృదుపదద్వయముతోడ, స్వర్ణభూషణ రంజితాంబరము తోడ
రత్నకింకిణీకా రమ్య రశనతోడ నిత్యకల్యాణి నా ప్రోల నిలచుగాక!

గోటికాంతులతో తమ కొలుచువారి తనువు చీల్చెడి తల్లి సౌందర్యవల్లి
కోటి సూర్యోదయమ్ములు కొలువుచేయు అప్రమేయ మహాద్యుతి ఆ వెలుంగు!

ఆమె అరుణప్రభాప్రవాహములలోన
మధురముగనిల్చుబ్రహ్మాండమండలమ్ము
శ్రుతివధూమణి సీమంతశోభ చిందు
చెందిరమ్మే పదాంబుజ శ్రీరజమ్ము.

భక్తమానస హంసిక స్వర్ణగర్భ వాగధీశ్వరి సావిత్రి భాగ్యలక్ష్మి
కామరూపిణి కల్యాణి కంజనయన మధురమంజీరరవములు మనుచుగాక!

కరుణాపాంగతరంగిణీ! కుముదినీ! కాత్యాయినీ! నీలకం
ధర శుద్ధాంత విహారిణీ! కుసుమబాణ ప్రాణ సంజీవనీ!
చరణాబ్జాత విభూషిత శ్రుతిశిరస్సౌందర్య ముక్తామణీ!
పరమాహ్లాదినీ! సంశ్రితాభ్యుదయ సంపత్కారిణీ! రంజనీ!

— x —

# భారతీ స్తుతి

మధురకవిరత్న, కవిశేఖర, కావ్యార్క,
మూలా పేరన్నశాస్త్రి

ఉ॥ శ్రీకర తావకామృతపరీత కటాక్ష ముహుఃప్రసారముల్
ప్రాకట మామకార్యకృతిపాళివయిం బరఁగించి యాదృతిన్
జేకొని నన్ గృతార్థునిగఁ జేయుము; తల్లి! కవీంద్ర కల్పవ
ల్లీ! కృపఁ బండ; నీపదములే గతి; సద్గతిఁగూర్చు భారతీ!

ఉ॥ శారదచంద్రికాధవళ చారుశరీర! బృహత్కృపా సుధా
ధార! జగత్త్రయీకరణ ధారణ మారణ మూలకారణా
గార! భవోగ్రకానన విఖండనధీర! యశేష వాఙ్మయా
కార! త్వదీయమూర్తిఁ గనఁగాఁ దగు భాగ్యముఁగూర్చు భారతీ!

ఉ॥ అంబ! వినీలకుంతలభరాహిత దివ్యసుమాగ్రసక్త రో
లంబ! దృశాంతదర్శిత విలాసకదంబ! నిసర్గ సద్గుణా
లంబ! హసత్ప్రసన్నముఖలజ్జిత శారదపూర్ణ చంద్రమో
బింబ! నిను దలంతు సుకవిత్వ పటుత్వముఁ గూర్చు భారతీ!

ఉ॥ చల్లని చూపుతోఁ దళుకుపిఁడాబిలి యందముఁ గేరు మోముతోఁ
బల్లవ పాణితోఁ గులుకుఁ బల్కులు పల్కెడి కేలిచిల్కతోఁ
దెల్లని యంచతోఁ బలుకుతేనెలతోఁ గరుణారసంబు చి
ప్పిల్లెడు మూర్తితోడఁ గనిపింపుము నాకొకసారి భారతీ!

ఉ॥ పాణియుగమ్ము భక్తిమెయి ఫాలతలమ్మునఁ జేర్చి నిత్యక
ల్యాణిని, గంకణక్వణన లాస్యవిశిష్ట విపంచికా లస
త్పాణిని, దేవతానికరవర్ణ్య పవిత్ర మహార్హ సద్గుణ
శ్రేణిని నిన్నుఁ గొల్చెదఁ బ్రసిద్ధకవిత్వముఁ గూర్చు భారతీ!

—x—

# 'నవరత్న మాలా'

డా॥ కర్ణ రాజశేషగిరిరావః, ఎమ్. ఏ; పి. హెచ్.డి;
రిటైర్డు హిందీ ప్రొఫెసరు, ఆంధ్ర విశ్వవిద్యాలయము.

శ్రీయుతాం చిత్కళాలాస్యాం, స్నిగ్ధస్నేహ పరిపూరితామ్।
భారతీం, భాగ్యశాలినీం, వన్దే, వాణీం, వరప్రదామ్॥

వేదవేద్యాం, మహాదేవీం, సర్వాలఙ్కార భూషితామ్।
కమ్బుకణ్ఠీం, మహాశక్తిం, వన్దే, వాణీం, వరప్రదామ్॥

సువాసిన్యై, నమో నిత్యం, సువాసాయై నమోనమః।
వినిద్రాయై, నమో, నిత్యం, విశాలాక్ష్యై, నమో నమః॥

శారదే! భక్తవత్సలే!! భక్తిం, త్వయ్యచలంకురు।
విద్యావృద్ధిం, క్రియాసిద్ధిం, ప్రసీద! మే సరస్వతీ!!

సచ్చిదానందరూపిణీ! ప్రసీద! త్వం ప్రసీద! త్వమ్!
విద్యాలఙ్కార భూషితే, ప్రసీద! త్వం ప్రసీద! త్వమ్!!

లోకమాతా, జగద్వన్ద్యా, వీణా పుస్తక ధారిణీ
అలఙ్కార ప్రియా, దేవీ, సా మే, వాచి, వసేన్ముదా

లోకవన్ద్యా, జగన్మాతా, సురుచిరా, శుభప్రదా
కళాప్రియా, నాదలోలా, సా మే, వాచి, వసేన్ముదా

బ్రహ్మప్రియా, బ్రహ్మవేద్యా, వాగర్థసు సమన్వితా
నిత్యానన్ద, ప్రదాయినీ, సా, మే, వాచి, వసేన్ముదా

నిరవద్యా, నిరాకారా, నిత్యవన్ద్యా, జయప్రదా,
సర్వశాస్త్రార్థ సమ్పన్నా, సా, మే, వాచి, వసేన్ముదా

హంసవల్లీ, సురజ్యేష్ఠా మఙ్గలాఞ్చిత విగ్రహా
పద్మాలయా, పరంజ్యోతిః సా, మే, వాచి, వసేన్ముదా

— x —

# చదువుల తల్లి

ఆచార్య, విజ్ఞానభాస్కర, వసంతరావు వేంకటరావు, ఎమ్. ఏ
రిటైర్డు ప్రిన్సిపాలు, ఎమ్. ఆర్. కాలేజి, విజయనగరము.

శబ్ద ముత్పన్నమౌ చలనమో గమనమో
స్పందమో వాటిల్లు సమయమందు,
వివిధపౌనఃపున్య వితతి ప్రసారమౌ
జవముతో గాలిలో సర్వదిశల
ధ్వనితరంగా లవి; వ్యాపించుటకు యాన
క మ్మెద్దియైన ముఖ్యముగ వలయు,
యానక ముండియు వ్యాపించు ధ్వనులలో
వినిపించు నవి వినిపించ నవియు

కలిసి యుండును, వాటిలో కర్ణగోచ
రమ్ము కాగలవాటినే లాగుచెవులు;
చెవికి వినిపించనివి విశ్వసింపులందు
లే వనెడువారు జ్ఞానము లేనివారు.

ఆకాశంబున శబ్దజాల మతి సూక్ష్మావస్థలో నుండగా
మా కర్ణేంద్రియముల్ గ్రహింపగల సామర్థ్యంబు లేకుంటచే
ఆకాశంబన శూన్యమందురు జనుల్, న్యాయమ్మె? విజ్ఞానులీ
ఆకాశాంతర శబ్ద సంతతి బృహత్ యంత్రాలతో పట్టరే!

పరమాణుకేంద్రకం బాధారముగ ఎలెక్ట్రాన్లు భ్రమించగా కలుగు ధ్వనులు.
సౌరమండల సూర్య శక్తికి లోబడి తిరుగు గ్రహాల్ చేయు పరమ ధ్వనులు,
తమలోననె భ్రమించు తారకా కూటముల్ పుట్టించు తీవ్రమై నట్టి ధ్వనులు
భూమిచుట్టు భ్రమించు భూపుత్రు డగు చంద్రుడలవోకగా చేయునట్టి ధ్వనులు,

అన్ని ధ్వనులె కాని; అవంత మనచెవుల్
పట్టజాల నట్టి వేటచేత,
చెవికిసోకనట్టి భవహర శబ్దముల్
విశ్వగాన మంత్రడు, విబుధులెల్ల!

మనసులోనున్న భావముల్ మాటలాడి
వ్యక్తమొనరింపవలె కదా! భాషలేక
సంప్రతింపు అసాధ్యము; సంఘవృద్ధి
కూడ జరగదు భాషలేకున్న నిజము.

అవ్యక్తమే వ్యక్తమై బిందురూపాన
పరిణమించెను పరావాక్కనంగ,
బిందుప్రకంపముల్ విస్తరించుట చేసి
పశ్యంతి వాక్కుగా పరిఢవిల్లె,
ఇక, పరాపశ్యంతులకు మధ్య నుదయించె
నాదము సప్తస్వరాదిగతుల,
వాగ్రూపమును పొందె వైఖరి, వైఖరీ
పశ్యంతులకు మధ్య వర్ణమాల

ఉద్భవించెను, బహుభాష లొలయ జొచ్చె
భాషతో భావవృద్ధియు బహువిధాల
జరిగె, సారస్వతము లెన్నొ పెరిగె, మనిషి
జ్ఞానమార్గాన పయనించుసరణి నెరిగె!

చదువులొసంగి, భావముల సారము చక్కగ వెల్వరించు సం
పదగల భాషనిచ్చి, మతిమంతులజేసి, విశేషశేముషీ
సదమల మేధనిచ్చి, భవసాగరతారణమైన జీవనా
భ్యుదయము జూపు జ్ఞానరస మూర్తికి వాణికి నా నమస్కృతుల్

— x —

# శ్రీ శారదాంబా నవరత్న మాలికా

ఆచార్య శ్రీ పులవర్తి నూకాలరావు, ఎమ్. ఏ; బి. ఇడి.
ప్రిన్సిపాలు, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, సాలూరు

పద్మసంభవురాణి! సౌభాగ్యమస్తు
జ్ఞానవిజ్ఞానమయి! నిత్య సంపదస్తు
బుద్ధిరూపిణీ! సంకల్ప సిద్ధిరస్తు
సతతశుభవృద్ధిరస్తు తే శారదాంబ॥

ఉద్య దరుణాంశు తులితాధరోష్ఠబింబ!
సతత సంస్తూయమాన నిర్జరకదంబ!
సైకతనితంబ! సన్నుతసాధుభక్త
సాధకాలంబ! శరణంబు శారదాంబ॥

నిత్య! నిర్మల! నిరుపమ! నిష్కలంక!
సగుణ నిర్గుణ నిఖిలసంసారదూర!
ఆద్య! నిరవద్య! నిగమాగమాత్మ నిన్నె
సంశ్రయింతుము సతతంబు శారదాంబ॥

వేదములు నీవె, విధులీవె, వేత్తవీవె
పుణ్యమును నీవె ఫలమీవె భోక్తవీవె
అఖిలజీవుల హృదయ గుహాంతరమున
సాక్షియును నీవె సత్యంబు శారదాంబ॥

సిద్ధిదవు సిద్ధిరూపవు సిద్ధలోక
సేవ్యమానవు సకలార్థసిద్ధియుతవు
సిద్ధులెల్లరు వాంఛించు సిద్ధి వీవు
సర్వలోకైక జననివి! శారదాంబ!

చదువులందున నినుదెల్పు నదియె చదువు,
ఆత్మవగు నిన్ను జూపెడు నతడె గురువు,
భక్తి నినుగొల్చు మనుజుడే పండితుండు,
సంశయము లేదు సత్యంబు శారదాంబ.

అఖిలదురితాటవీ హరణాగ్నికీల,
మోహసంసారదావ జీమూతమాల,
నళినసంభవ ముఖరంగ నటనశీల,
సరసవాగ్జాల! శరణంబు శారదాంబ.

అఖిలవరముల నిడు వేల్పువైన నిన్ను
విడచి యల్పుల నరుల సేవించు టెల్ల
ప్రీతయగు కామధేనువు విడచి, ఖరము
సంశ్రయించుటయే గదా శారదాంబ.

కర్మసంక్షయమగును హృద్గ్రంథి విడును
సర్వసంశయములు దీరు శాంతి గలుగు
ద్వైతవర్జిత! నీదివ్య దర్శనమున
సర్వశుభములు కల్గును శారదాంబ!

ఓం తత్సత్.

# వాణి!

అభినవ తిక్కన, కళాప్రపూర్ణ,
శ్రీ తుమ్మల సీతారామమూర్తి

నిన్నుఁగూర్చి తపము నెఱపినవానికే
వచ్చు నచ్చమైన వాకుబలిమి;
బాఁకుబలిమి తీచ్చపడు దీనిముం దహో!
యసదృశంబు నీ మహత్త; వాణి!

— x —

# శ్రీ శారదా స్తుతి

సాహిత్య విద్యాప్రవీణ, ఆర్ష విద్యాభూషణ, మధురభారతి,
శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావు

శ్రీమన్మంగళ హేమపీఠ విలసద్వాణీ సుధావర్షిణీ
ఏణాంకానన భాసమాన దరహాసవ్యక్త చిద్రూపిణీ
వాణీ మంగళమాతనోతు కృపయా స్వానాం సదాఽకర్షిణీ
అక్షయ్యాంచిత వాక్సుధా మధురస స్రోతస్వినీ భాషిణీ॥

యా విద్యావరదేవతా భగవతీ బ్రాహ్మీమయీ దేవతా
యాశక్తిః ప్రణవాత్మికా మునిమనఃకంజాత సమ్మోదితా
యాదేవీ పదవర్ణ శబ్దమయ వాగ్రూపే సంభూషితా
సా మాతా కరుణారసార్ద్రహృదయా పాయాత్ గిరాం దేవతా॥

శృతివాక్సురభి లతాంతాం
నిగమాగమ శాస్త్రసార విదితాం తాం
శరదిందు సమానకాంతి కాంతాం
విధికాంతాం నౌమి దివిజ వినుతాం తాం॥

ఆమంత్రితాం నిఖిల వాగ్భవబీజ వర్ణైః
ఆరాధితాం మఘవ గీష్పతి మౌనిబృందైః
ఆసేవితాం విబుధ సజ్జన సత్కవీశైః
తాం శారదాం వినమితః ప్రణతోస్మి నిత్యమ్॥

యా దుర్గా శివకామనా శివమయీ సత్వారిసంహారిణీ
యాలక్ష్మీ శ్శుభకామదేతి నిగమైః స్సుశ్లోకితా మోహినీ
యావాణీ కలభాషిణీతి సుమన స్సంభూషితా మోదినీ
సాదేవీ జయతాత్ సమర్చితపదా కల్యాణ కాదంబినీ॥

హంసవాహ సమారూఢాం హంసరూపాం సనాతనీం
అకారాది క్షకారాంతం వాగ్దేవీం ప్రణమా మ్యహమ్.

నమామి శారదాదేవీం వీణాపుస్తకధారిణీం
వహ్నిశుద్ధాంశు కాధానాం పుష్ట శ్రీయుక్త విగ్రహమ్.

విష్ణ్వీశాది సమారాధ్యాం విశ్వవాఙ్మయ రూపిణీం
విజ్ఞానకలనాం విద్యాం గిరాందేవీ ముపాస్మహే.

శారదచంద్రికా విమల శైత్యతరమ్మగు నీదు సత్కృపా
సారచయమ్ము మాపయిని చల్లగ జల్కగజేసి లోకస
త్కార యశమ్ము పొందితియు కమ్మని కైతలసొంపు నింపుమో
శారదః నిర్జితేందు రుచిసార విశారదః యోసరస్వతీ!

సరస సంగీత సాహిత్య సరణి దెల్పి
సజ్జనాళికి నీవు సాక్షాత్కరించి
కల్పలతికా సద్వృక్షమౌ కళల నిచ్చి
సాకు మోయంబః వినుతింతు శారదాంబ!

కృతివాఙ్మయ ధురభూజము
మతిమంతుల హృదయసీమ మందారసుమం
బతిదీనుల కల్పకమౌ
సతి భారతి స్వాశ్రితాళి సాకుత మెపుడున్.

— × —

# శ్రీ వాణీ విలాసః

శ్రీ జి. వి. యస్. సుబ్రహ్మణ్య శర్మా, ఎమ్. ఏ;
సంస్కృత శాఖాధ్యక్షః ఏ వి ఎన్. కళాశాలా, విశాఖపట్టణమ్.

శారదా శారదాంభోజ వదనా వదనాంబుజే।
సర్వదా సర్వదాఽస్మాకం సన్నిధిం సన్నిధిం క్రియాత్॥

జాయాభూత్వా విరించేస్త్వం సర్గశక్తిం విధాస్యసి।
నదీభూత్వా సర్వలోకాన్ ప్రపూతాన్ ప్లావయిష్యసి॥

వాణీభూత్వా సర్వజీవాన్ సూక్తినిష్ఠాన్ విశారదాన్।
కరిష్యసి హి కళ్యాణి! త్వాం నతోఽన్వర్థ సంజ్ఞకామ్॥

స్త్రీరూపా బ్రహ్మభార్యా త్వం, నదీరూపా మహోదధేః।
వాగ్రూపా కవివక్త్రిత్వం త్వాం నమామి సరస్వతీం॥

సర్వశుక్లాం శుద్ధరూపాం కావ్యరూపాం కళాలయామ్।
వీణాం మాలాం శుకం గ్రంథం హస్తైర్దధతీం భజే॥

భారతీ భారతానస్మాన్ సుపుష్పాంశ్చ సరస్వతీ।
కృపయా కురుతాద్దేవీ శారదా ధీవిశారదాన్॥

హంసారూఢా చ హంసజ్ఞాన్ విఖ్యాతాన్ సా జగన్నుతా।
వాగీశ్వరీ వచోనిష్ఠాన్ కౌమారీ నిత్యనూతనాన్॥

జితేంద్రియాన్ బ్రహ్మసంస్థా, బుద్ధిధాత్రీ వివేకినః।
వరదాత్రీ సుసంపన్నాన్ క్షుద్రఘంటా విశోకినః॥

ద్వాదశైర్నామభిర్దేవీ, స్తూయమానా సరస్వతీ।
కృపయా కురుతాదస్మానున్నతాన్ భువనేశ్వరీ॥

విజ్ఞానకలనాం బ్రాహ్మీం, శ్రుతిసంస్తుత వైభవామ్।
నౌమిత్వాం జ్ఞానదాం, మేధా, మజ్ఞానధ్వాంత దీపికామ్॥

శారదాం సృష్టికర్త్రీం త్వాం, సర్వమంత్ర స్వరూపిణీమ్।
మనువిద్యాం, వేదవేద్యాం, ప్రజ్ఞాన ఘన రూపిణీమ్॥

ఆత్మవిద్యాం, సిద్ధవిద్యాం; తత్త్వ మర్థ స్వరూపిణీమ్।
ఛందస్సారాం, కళానాథాం; కావ్యాలాప వినోదినీమ్॥

వీణాశారద తుంబురు ప్రముఖ సదీణానినాదప్రదా,
వాణీ కంజజవక్త్ర పావనకరీ వేద్యై నాదోద్గమాత్।
అంబ, స్తేనుదతేఽఘ మంబ! దయితే పద్మోద్భవస్యానఘే!
సేవాఽఽనంద ప్రదాయినీ విజయతే బ్రహ్మణ్య మోంబ్రాహ్మనః॥

వీణయా లలితాదేవి! భాషయా త్వం పటీయసీ।
గదయా దుర్ధర్షాచ; సదయా బహు భావ్యసే॥

శుంభ చ్ఛుంభ నిశుంభ దంభ దమనాలంభూత బాహాచతు
ష్కోల్లక్ష్యన్నిశితాసి శూల శకటాంగ ప్రాస శ్రేష్ఠాయుధామ్
కాళీరూప కరాళవక్త్ర విలసద్భ్రూవ్యాప జిహ్వాగ్ర స
ద్ధారాస్ప క్రవినష్ట రక్తజతనుం త్వాం నౌమి సారస్వతీమ్॥

లలితాయాశ్చ సాహస్రం, శ్రీరామాయణము త్తమమ్।
భవత్త్యైవ ప్రదత్తౌనః; గ్రంథౌ లోకోపకారకౌ॥
సారస్వతేన నో దేవి! జహ్యాంతరజం తమః।
సానుకంపార్ద్ర యా దృష్ట్యా; సర్వాభీష్ట ప్రదా భవ॥

మేధాసి దేవి! విదితాఖిల శాస్త్రసారే
అంభోజ సంభవప్రియే నిగమస్వరూపే
వాగర్థయోజన పరే వరమంత్రరూపే
త్వాం భావయామి సతతం సకలార్థదాత్రి॥

ఇతిశమ్.

— x —

# వాగీశ్వరీ వరివస్యా

విద్వాన్, ఉభయ భాషాప్రవీణ,
శ్రీ తుమరాడ సత్యనారాయణ. "భరద్వాజ"

వరవర్ణోద్భవ సప్తనాద శుభ భాస్వత్కచ్ఛపీ వల్లకి
కర మచ్ఛద్యుతి నింప, నక్షయ సుధా క్రమాక్షమాలా మనో
హర హస్త మ్మఖిలాఘ నాశనము చేయన్, సాంద్రవిజ్ఞాన వి
స్ఫుర దోంకారకృతీంద్ర హస్తము మహా శోభావళిం గూర్ప, భా
స్వర నీరేజ కరమ్ముతో వెలుగు శ్రీ వాగ్దేవి నర్చించెదన్.

విచర ద్వేదశిఖా మనోహర మహా విశ్వంభరన్, విష్టప
ప్రచలచ్చేతన రూపిణీన్, ధవళ వర్ణ ప్రాంచి తోదార హం
స, చలద్గామిని, స్వచ్ఛ శారదిక జ్యోత్స్నాహాసినిన్, విశ్వస్ఫు
రుచిరోత్సంగ నివాసినిన్ గొలుతు హర్షోత్కర్ష వాగీశ్వరిన్.

గతి శింజాన సహస్రరత్న సుషమాక్రమాంఘ్రి యుగ్మన్, రుచి
క్రతుభుగ్దేవ సురేంద్రమౌని జనతా గంధర్వ సిద్ధాది స
న్నుత, శంపాశత రమ్యదేహలతి కా నూనన్, విపంచీ కరన్
శతపత్రోద్భవరాజ్ఞి సంతత సమర్చాధార భూషించెదన్.

దరవిద్యోతిత దృగ్గతేజ మహిమాంతర్గర్భ పీయూష స
త్కరుణన్, లోకము నింపుచున్ మధునినాద ప్రస్ఫుర ద్వీణయై
పరమేష్ఠి రసనాగ్ర కాంచనమణీ స్వచ్ఛప్రభా డోలికన్
మురువుల్ సూపెడి ముద్దరాలి సిలుగుల్ బోదోల సేవించెదన్.

సకలాశాంతర దేశ సంవలిత చంచజ్జీవ చైతన్య చం
ద్రిక, నిర్ధూత సమస్త గ్రామ్యమయ నిస్తేజస్క దుర్వ్యావహా
ర, కళాశాంబరి సంప్రదాయ రససంరంభ ప్రమోదాత్త, గ్రాం
థిక భాషారుచి రూపిణీన్, మధు గిరాందేవిం బ్రశంసించెదన్.

పటు కటు రూక్ష నగ్న పరిభాషణ విప్లవ వ్యావహారి కో
ద్భట, రసహీన కుత్సితపుభండన సంస్కృతిరూప తావక
చ్ఛటలను జూడలేను! వెదజల్లుము నావయి కొంత నీ కృపన్
స్ఫుటతర గ్రాంధికోర్భయ సుశోభలు సూపి సనాతనాక్షరీ!

శైలీపాక విభూషణోక్తి విలసచ్ఛబ్దార్థ నిర్దుష్ట శో
భా శీ పూర్ణ గుణోత్తమ ప్రథిత శిల్పౌచిత్య విజ్ఞాన లీ
లా, లాస్యప్రతిమాన గ్రాంధిక భవత్రాచీన పూర్ణాకృతిన్
నాళీకోద్భవరాజ్ఞి చూపి నను ధన్యప్రాణి, గావింపవే.

ఘనసారాంచిత ధూపదీపములతో కస్తూరికా రక్త చం
దన మందార లతాంత మంజరులతో తాంబూల ముక్తాళి పూ
గ, నవౌదార రుచి ప్రవర్ధక మహాక్షౌమాంబరంబున్, కడున్
ప్రణమచ్ఛీర్షుండనై యొసంగెదను గీర్వాణోక్తితో నీకు నో
జననీ! గైకొని తావకాక్షయ మహాచ్ఛాశీస్సు లందించుమా!

—×—

# శ్రీ సరస్వతీ స్తుతి

శ్రీమతి ఊరంకి బాలా త్రిపురసుందరమ్మ.

అమ్మరో నీవు జీవరసనాగ్రము లందున నిల్చి శబ్దజా
లమ్మును గ్రమ్మరింప సుకరంబగు జీవితయాత్ర క్లేశలే
శ మ్మొకయింత లేక సరసంబగు పల్కుపసందు చేసి లో
కమ్ము జయించునట్టి కలకంఠుల కంఠపుసౌరు నీవెగా

అతిచంచలత్వంపు టత్త కన్నను నీవు స్థిరవాస మెడదల జేతువమ్మ,
ఒకచేతి శుకము వేరొకచేతి వీణయు గాంధర్వమధు ప్రతీక లయి వెలుగు,
ఒకచేతి పొత్త మింకొకచేతి జపమాల విద్యాప్రతీకలై వెలయు నీకు,
నలువ మొగంబుల విలసిల్లు వేదముల్ నీ వేదమాతృత్వ నియతి తెలుపు,

జీవకోటుల కాధారజీవ మీవు
నీవు తవణింపకున్న మన్నికయె లేదు
భవ దుదార గీఃప్రభలు నావశమె, తల్లి!
వర్ణనముచేయ, నీదయవలన గాక.

బమ్మెరపోతరాజు కృతి భాగవతమ్ము రచించువేళ వే
గమ్ముగవచ్చి, యెట్టెదుట, కాటుకకన్నుల నీరుకార్చుచున్
కిమ్మనకుండ నిల్వ, పరికించి నమస్కృతిచేసి, యమ్మ! కా
వ్యమ్మును నమ్మ కూళుల కటంచును పల్కుల బుజ్జగింపడే.

కలుములొసంగు లచ్చికిని గాదిలికోడలవై చరించుచున్
నలువకు రాణివై తనరి నాట్యముసల్పుదు వీవు, జిహ్వలన్
పలురస కావ్యగుంఫముల వర్షగ జేయుదు వీవు తల్లి నీ
పలుకు చమత్కృతుల్ తెలియబల్కగ నేకవి శక్తిమంతుడౌ.

కరుణాసింధువ వీవు భక్తతతిపై కారుణ్యమున్ జిల్క నే
మొరడైనన్ జిగురించి వర్ణవిలసత్పుష్పౌఘముల్ దాల్చి త
త్పురభిన్ దిక్కులచాటు తద్విధమునే తోడ్పాటు సంధిల్లగా
నిరుపేదైనను కావ్యసంపదలచే నిత్యంబు శోభింపడే.

కలుగవె సర్వసౌఖ్యములు కంజజు రాణి యెడందలందునన్
వెలసి మనోహరంపు రసవీధుల నీవు నటించుచుండగా
పలుకులజాడనేర్వ బుధవర్గము నిచ్చ దపించుచుండ నీ
పలుకులపొల్పు నేర్పగల పౌఢిమ నాకిడు మమ్మ భారతీ.

పండితమండలీ హృదయపద్మములందున నీవు నిల్వగా
కొండొక లోపమేమి యొనగూడున దివ్యకవిత్వ వాహినుల్
కొండలనుండి పారి ధరకున్ ప్రవహించి ప్రమోదమిచ్చు నీ
యండగదా కవీశ్వర మహత్వ కవిత్వపు ధీప్రసక్తికిన్.

వనితలు నీ స్వరూపమున వర్తిలుచుందురు కంఠమాధురీ
జనిత రసప్రవాహముల చక్కని గీతిక లాడుకొంచు నీ
కనుతుదిచూపు వారిపయి గ్రాలక యయ్యది సాధ్యమౌనొకో
అనితర కావ్యకంఠ మధురాన్విత సౌష్ఠవ మిమ్ము భారతీ

శ్రీ శ్రీ శ్రీ

— × —

# శారదా!

శ్రీ ఆదిభట్ల పట్టాభిరామయ్య

శారద చంద్రికా ధవళ చారుశరీర! కరాంచలోచ్చలత్
స్ఫార మనోజ్ఞకీర! విలస న్నవమౌక్తికహార! కావ్యమం
జీర! మరాళఘోటక విశిష్టవిహార! కవీంద్ర గాయకా
ధార! కృపాంతరంగ సముదార! ననుం గరుణించు శారదా!

నలుమోముల్ గల సృష్టికర్తయును శోణచ్ఛాయ శోభిల్లువాఁ
డిలలోఁ బూజ కనర్హుఁ డాతనికి నీ విల్లాలివయ్యున్ మహో
జ్జ్వల వర్ణాకృతిఁ బూజలందెదవు నిర్వ్యాజమ్ముగా సత్వసం
కలితుల్ గాక రజోగుణాఢ్యులు సమగ్రస్ఫూర్తులే? శారదా!

సురసంఘమ్ములు నిన్నుఁ గొల్చుచు మదిన్ శుభ్రప్రకాశంబులౌ
దరహాసాంగ విలోకనమ్ముల నవిద్యన్ రూపుమాయించు నీ
కరపద్మమ్మున నక్షమాలికకు రాగంబెట్లు సంధిల్లె నం
చరు దందన్ బతిసన్నిధానమున నిత్యం బొప్పవే! శారదా!

జడుఁడై వన్ భవదీయపూజన మొనర్చన్ సారసారస్వతా
ఢ్యుఁడు విద్వత్సభలందుఁ బూజ్యుఁడగు నిండున్ వాని కీర్తిచ్ఛట
ల్కడలం దెల్లెడ దర్ప ణోపరితలాక్రాంతాబ్జ బంధుప్రభల్
వడిఁ బర్యాప్తములౌ తెఱంగున ననున్ బాలింపుమీ శారదా!

ఇతిహాసమ్ములు మందహాసములు సాహిత్యాగ్రి గణ్యమ్ములౌ
శ్రుతు లామ్రేడిత కచ్ఛపీ శ్రుతు లుదారుల్ మెచ్చు షట్ఛాస్త్ర సం
తతి మంజీర ఘళంఘళారవళి మాతా! నిన్నుఁ గొండాడఁగా
మతిహీనుండను నాకు శక్యమగునే? మన్నింపుమీ శారదా!

—x—

# సరస్వతీ స్తవము

శ్రీ దిట్టకవి శ్రీనివాసాచార్య, ఎమ్. ఏ;

శ్రీ కుందేందు తుషార హార ధవళన్, శ్వేతాంబరాలంకృతన్,
రాకాచంద్ర నిభాననన్, వరగుణన్, రాజీవపత్రేక్షణన్,
లోకే శాచ్యుత భర్గ వందితను, సుశ్లోకన్, సురప్రార్థితన్,
పాకారి ప్రముఖార్చితన్, స్తుతమతిన్ ప్రార్థింతు పద్మాసనన్.

తెల్లని రూపభాసితను, తెల్వి నొసంగెడి దేవతామణిన్,
సల్లలితా ప్తభాషిణిని, చక్కని వీణధరించు కాంతనున్,
చల్లగఁ జూచు చేడియను, జాడ్యము బాపెడి యింతినిన్, మది
యొల్లమునందు నిల్పుచును నోపికతో భజియింతు శారదన్

వాణిన్, వినీల బంభర
వేణిన్, విశ్రుత వినూత్న విలసద్వీణా
పాణిన్, రాజీవోద్భవు
రాణిన్ ధ్యానింతు మదిని రయముగ భక్తిన్.

భారతీ మనోజ్ఞ చరణ పంకజములు, భక్తితోడను పూజించు భక్తతతికి
కలుగు నమరత్వ మిభ్భువి, కావున జను, లింపుగా సరస్వతిని పూజింపవలయు.

బ్రహ్మ విష్ణు మహేశ్వరుల్ వరుసగాను
సృష్టి, పాలన, నాశముల్ చేయుచుంట
మహితచారిత్ర, శారదామహిమ వలన
నంచు మదినెంచి పూజించవగును ప్రజకు.

# శ్రీ సరస్వతీ స్తుతి

ప్రౌఢ కవిశేఖర
శ్రీ తల్లాప్రగడ భవానీ శంకరము

శారదచంద్రికా ధవళ సన్నిభ గాత్రి! శశాంకరంజితో
దార జటాకిరీట! వరదాభయ పుస్తక తారహార సం
భార కరాంబుజా! పరమపావని! నిన్నొకమారు గొల్చినన్
క్షీర సుధా మధు ప్రకర శీతల వాగ్ఝరు లుప్పతిల్లవే?

సరస మనోజ్ఞభావ విలసన్నవ సూక్తుల నాలపింప నా
సరసిజగర్భరాణి మనసా భజియించి యుపక్రమింతు న
వ్వరమ దయాబ్ధి మన్మధుర వాక్య లస ద్రసనాగ్రవేదిపై
కరగతమౌ విపంచివయి కమ్రసుధారవళుల్ వెలార్చుతన్.

భారతి సన్నుతింతు ప్రతిభావిభవోజ్జ్వల పద్యగద్య వా
గ్ధార, సుధారసార్ద్ర పరికల్పిత భావవిరాజమాన శృం
గార పదప్రసార సుమగంధ ఘుమంఘుమ పొంగువార హృ
చ్చారు సరోజపీఠమున సారణిపై శృతు లాలపింపగన్.

ఏయమ కాలియందియల యింపగు మ్రోతలు కావ్య సృష్టికిన్
బ్రాయికమై మహాకవుల ప్రాజ్ఞతగూర్చునొ, యేశుభాంగి చాం
పేయ కదంబమాలికల పేటలు రాగరస ప్రసార మా
త్రాయుత లక్ష్య సాధనకు దానమొ, ఆయమ కేను మ్రొక్కెదన్.

శారద! నీమహామహిమ సన్నుతిసేయ సమర్థు లెవ్వరున్
లేరు జగత్త్రయంబున, విరించి సృజించిన ప్రాణికోటి కా
ధారము, నీవొసంగు వరదానము జీవన రాగవల్లరీ
కారణ, కామితోజ్జ్వల వికాసము, విద్యల కాలవాలమున్.

— x —

# ప్రసన్న భారతి

మధురకవిశేఖర: శ్రీ కొండేపూడి సుబ్బారావు.

శ్రీమ ద్భానుసహస్ర కాంతిమయ మూర్తీ! సర్వగీర్వాణ సం
స్తోమాభ్యర్చిత పాదపద్మ! కరుణాదుగ్ధాంబు రాశీ! జగత్
క్షేమానంద ప్రదాత్రి! ముక్తివరదా! చిద్రాజితాకార! వి
ద్యామాహేశ్వరి! భారతీ! త్రిజగదంబా! కొమ్ము కైమోడ్పులన్

నలువమోముల నలరు విజ్ఞానకాంతి,
మునిమనోధ్యేయ చిత్కళాభ్యుదయ రేఖ,
కోటి మంత్రపరంపరల్ కొలుచు చుండ
ప్రణవపీఠాన కొలువున్న భవ్యమూర్తి,
సరస సాహిత్య సంగీత జగతి నేలు
సత్కృపా విలోకన, సుప్రసన్న వదన,
అఖిల విద్యాధిరాజ్ఞి, లోకైక జనని,
శ్రీ సరస్వతి నన్ను రక్షించు గాక.

పరమవ్యోమ పథాంతరోచ్చలిత శబ్దబ్రహ్మమై, జ్ఞానసుం
దర నాద ప్రతిపాదక ప్రథిత విద్యాతత్త్వ విస్ఫూర్తివై,
స్వరసంశోభిత సాహితీవిభవ భాస్వద్దివ్య తేజమ్మువై,
నిరతానందమయాకృతిన్ వెలుగు నిన్ సేవింతు వాగీశ్వరీ.

ఏ తత్త్వాంచిత యోగసాధనఫల వృత్తమ్ము లధ్యాత్మ వి
ద్యాతాదాత్మ్యములై శ్రుతిస్మృతి మహోద్యద్ధర్మ సిద్ధాంతముల్
చేతఃప్రీతి ఘటించు, నా మధువచ శ్శ్రీరమ్య విజ్ఞాన ప్రి
జ్ఞాతాత్పర్య మహస్సు నీవె యనుచున్ గావింతు బ్రాహ్మీ! నుతుల్.

నీపై చిత్తము లగ్నమైనపుడు వాణీ! నీవె సావిత్రివిన్,
ఆ పద్మాలయు వానగాత్మజవు గాయత్రీ మహాదేవతా
రూపబ్రహ్మము వీవె యైన విలస ద్రోచిః ప్రభాసారముల్
నాపై గ్రమ్మి, జనించు నేవియొ రసానందైక రోమాంచముల్.

నిను భావించినయంత, సర్వజగతీ నిర్వేల సౌందర్య ద
ర్శనమం దక్షర రమ్యరూప రసరాజ్యానంద సంపద్భరం
బనుభూతం బగుచుండు మామనములం దాధ్యాత్మికస్ఫూర్తిమ
ద్వినుతంబై, యిది నీయనుగ్రహము దేవీ! చంద్రశుభ్రచ్ఛవీ!

ఏకార్యమ్ములు విశ్వశాంతిసుఖ సంప్రాప్తమ్ము, లాధ్యాత్మిక
ప్రాకామ్యమ్ములు, జ్ఞానసాధనకళా ప్రావీణ్య విద్యోల్లసత్
శ్రీకమ్ముల్, జగతీశుభంకరము లా చెల్వుల్, భవత్పాద పూ
జాకళ్యాణ తపఃఫలమ్ములు; శరచ్చంద్రద్యుతీ! భారతీ!

వర్ణన శ్రీమహితాక్షరాభ్యుదయ భాస్వత్ కచ్ఛపీ నిస్వన
ప్రణుతమ్ముల్. భవదీయ హస్తవిలస ద్రమ్యాంగుళీ ధూత ని
క్వణ సాహిత్యరసార్ణవమ్ములు, మమున్ బాలించి తేలించు నో
జననీ! భాసుర భావనానుభవ శశ్వ ద్దివ్య లోకమ్ములన్.

నాకనులం గనంబడక నాకమునం దలరారు మూర్తి వ
స్తోక మనోజ్ఞ శబ్దగుణసుందరి వీ యెడ నాదు భావనా
లోకములందు నా యెదదలోతులలో కదలాడు మోదరే
ఖాకలితమ్ము లాస్వరవికాసములే యని యెంతు భారతీ.

తొలి మేల్పొల్కుల నాటినుండియును ఛందోబద్ధమైనట్టి తీ
ర్పులె క్రొవ్వన్నె జిలుంగు బంగరులు కూర్పుల్ వెట్టి వర్ధిల్లె కై
తలకున్, శబ్దకళాధిదేవతవు మాతా! నీవు; మాకిట్టి చె
ల్వులు సర్వమ్మును నీదుకంటికొనవెల్గుల్ కావ్యసౌభాగ్యముల్.

వితతామ్నాయ సమస్తశాస్త్ర విలసత్ విజ్ఞాన మైనన్, మహో
న్నత సాహిత్యకళోజ్జ్వల ప్రతిభ యైనన్ నీదు కారుణ్య సు
స్మిత రోచీరమ సోకి నప్పుడె ప్రకాశింపన్ సమర్థమ్ము లో
క్రిత రక్షాచణ సత్కృపామృత మతీ! చిద్రూప రమ్యద్యుతీ!

ప్రాకటదీక్ష నేపృథుతపమ్ములు తామొనరించి, నీకృపా
లోకన భాగ్యమబ్బి కవులున్ ఋషికల్పులునై కవిత్వవి
ద్యా కమనీయ యోగఫల దర్శన సిద్ధుల నందినారొ, న
న్నాకృప జూపి ప్రోవుము దయాపరిపూర్ణమతీ సరస్వతీ!

తెలిమల్లెల్, మృదుచందనమ్ములును, చాంద్రీరమ్య రాగమ్ములున్
కొలబోయున్ వెలబోయు సత్కవుల వాక్కుల్ దేవి! నీపాదమం
జుల మంజీర మనోజ్ఞ వైభవ విలాసోద్దీర్ణ శింజాన సం
కలితాదేశ వశమ్ములై, మధురవాక్చాతుర్య ధుర్యమ్ములై.

వ్రాసితి కొన్ని గ్రంథములు భక్తిరసస్ఫురదైక సాహితీ
భాసుర భావుకత్వమున; వ్రాయదలంచుచు నుంటి నేవొ, నా
యాసలు మోసులెత్తి విరియన్ భవదీయ కృపావిలాసమే
వీసమొ చాలు నమ్మ! సుకవిత్వపయోనిధి నీద గల్గుదున్.

చందస్సుందర కావ్యమార్గగత దీక్షాబద్ధుడన్ నేను; తత్
సౌందర్యమ్ములు సంప్రదాయకవితా స్వారస్య పారంపరీ
సందర్భమ్ములు వీడనీయకువె మాతా! నన్ను, సంవిత్కళా
సందీప్తమ్ములు పూర్వసత్కవి తపస్సంసిద్ధు లాయందముల్.

మోమోటమ్ము విదల్చి చెప్పెద కృపాపూర్ణాకృతీ! భారతీ!
మేమో లౌకిక కార్యవర్తనుల మీమిథ్యాపరివంచాబ్ధి పా
థోమధ్యమ్మున నూగుచుందుము నినున్ దూరస్థగా జేసి, వి
ద్యామాహేశ్వరి వీవు చూపు మొకరథ్యన్ భుక్తికిన్ ముక్తికిన్.

మానవ ధర్మపద్ధతులు మానిరి, మానిరి నీతి వర్తనల్,
మానవ జాతి నేడొక ప్రమాదమునం బడిపోయె నిట్టి యు
జ్ఞాన మహాంధకార మరికట్టగనెట్టి మహోపకార వి
జ్ఞానమరీచికల్ విరియగ్రమ్మెదొ! నెమ్మదులందు భారతీ!

ఏ నీచేతి విపంచికా మధురవ స్వృష్టమ్ములై సాగెనో,
మానన్నయ్యయు పోతనాది కవిధాణ్మాహేంద్ర సారస్వత
శ్రీనాదమ్ములు తత్సుధామధురముల్ చిందింపు మేబిందువో,
వీణాదేవి! మనోజ్ఞ శబ్దకలశాబ్ధీ! నాదు వాగ్వల్లికిన్

నాకొక దివ్యనందన వనాంతర సుందర కల్పవల్లియై
నీ కనుదోయివెల్గు లెద నిల్చిన యేని, కవిత్వసుందర
శ్రీ కమనీయతల్ విరియజిమ్మగ లేనె, మనోజ్ఞశబ్దశో
భాకర దీప్తి! భాసుర కృపామధుమూర్తి! ప్రసన్న భారతీ!

ఆశల్నిండిన శబ్దసౌరభము నీవై శబ్దపాండిత్య వా
రాశిన్ లోతులు జూచు ప్రజ్ఞ అణుమాత్రంబేని లేనట్టి నా
కాశాదీపిక వౌచు నిన్నినుతి సేయుంబూను గ్రంథమ్మునన్
లేశమ్మౌ నవకాశమిచ్చితివి తల్లీ! నేను ధన్యాత్ముడన్.

పరమార్థమ్ము సరస్వతీ మహిత దివ్య న్మంత్రబీజాక్షర
స్ఫుర దుద్యన్మహిమమ్ము మమ్ము నిరతమ్మున్ బ్రీతి పాలించుతన్;
పరిరక్షించుత మమ్ము నిత్యము మనోవాక్కాయ కర్మమ్ములం
దురుతేజమ్ము సరస్వతీకవచ పాఠోన్మేష ధీశక్తియున్.

# ఆనంద నిష్యందినీ!

'అవధాన సరస్వతి' 'కవి పంచానన'
ఆచార్య. శ్రీ పేరాల భరతశర్మ, ఎమ్. ఏ;
ప్రిన్సిపాల్ ప్రభుత్వ ఎమ్. ఆర్. సంస్కృత కళాశాల, విజయనగరము

శ్రీంద్రస్ఫూర్జిత భావనావశ జగల్లీలాపురుత్వమ్ము స్వః
కేంద్రానాహత నాదజాగరిత నాకీనైక భోగస్ఫుర
చ్చాంద్రీస్రావ సుధానులిప్తము రసాంచద్దీపరానంద భా
గైంద్రాణీయము తేజ మద్భుతము నాకానంద మందించుతన్.

హ్రీంస్ఫార త్రిపుటీకుటీ కులనటీ హిందోళహీరప్రభా
సంస్ఫోట స్ఫుట నాదబిందు సకలాక్షస్వీకృ తాత్మాకృతీ!
హంస్ఫీతాంత రసాకృతీ రసకృతీ! ఆనంద సారస్వతీ!
సంస్ఫూర్తి స్పృహణీయ ధారణవిలాసం బిమ్మసాధారణీ!

శ్రీనాథాది కవీంద్రసాంద్ర సువచః స్ఫీతాత్మ చక్రాంతర
శ్రీనాదమ్మొ! రసార్ద్ర యోగిహృదయ శ్రీపద్మినీ భ్రామరీ
ధ్యానమ్మొ! రమణీయ రాగరస సంధానమ్ము గావించు వి
జ్ఞానమ్మొ నినదింపు మమ్మ యెదలోనన్ వాణి వీణాధ్వనీ!

ఐంద్రా వైష్ణవ రౌద్ర సత్య జగదీశాద్య ప్రభావాఢ్యమై
సాంద్ర ప్రస్ఫుట పద్మకోశ రుచిమత్సౌందర్య సంపాద్యమై
మంద్రోచ్చస్ఫురి తాదిమధ్యలయ సంపత్స్వర సాపాద్యమై
కేంద్రీభూత జగన్నియంతృ కలయౌ శ్రీమూర్తి కీర్తించెదన్.

క్లీంకారాంతర కీలితాఖిల జగల్లీలా విభూతీ! రసా
లంకారోల్లసి తాద్యనాదముఖరారజ్య త్ప్రభావద్యుతీ!
అంకారోపిత వారణానన కుమారానంద నిష్యందినీ
సంకల్పించెద నాత్మచక్రమున నిన్ సర్వార్థ చింతామణీ!

ఓంకారశ్రుతి పంజరాంతరశుకీ! యోగీంద్రరాజ్ఞానసీ
హ్రీంకార స్ఫుట నాదబిందు కలహంసీ! ఆగమారామజ
శ్రీంకారోజ్జ్వల పింఛలాంఛిత మయూరీ! భావనానంత ధీ
పంకేజాత సహస్ర సంచరదళీ! భద్రమ్ము లీయంగదే!

— × —

# సరస్వతీ స్తవము

శ్రీ జి. సాంబశివరావు, ఎమ్. ఏ;

శ్రీమ దఖండమై వెలుగు చిన్మయరూపము యోగివంద్యమున్
తామరసోద్భవాది విబుధావలి సేవ్యము నిత్య సత్యమున్
శ్రీమహనీయ వైభవము సిద్ధిదమున్ శుభదాయికంబు నీ
కోమల దివ్యగాత్రమును కూరిమితో భజియింతు శారదా!

జ్ఞాన మొసంగుమమ్మ భవసాగరమున్ తరియించు మార్గమున్
కానగ చేయుమమ్మ చిరకాలము నీచరణాబ్జసేవనే
మానుగ నీయవమ్మ నిను మానసమందున నిల్పు వారికిన్
వాణీ! విధాతృరాణీ! కవిపండిత పూజిత! యో సరస్వతీ!

నీ రమణీయ నామమును నిత్యము కీర్తన చేయు వారికిన్
సారకవిత్వ బంధురత శబ్దరసౌచితి రూప కావ్యలం
కారములందు వృత్తుల గుణంబుల శయ్యల రీతులందునన్
కోరిన కావ్యశక్తి సమకూడును నీవలనన్ సరస్వతీ"

సత్యము సాధువర్తనము శాంతగుణంబు ప్రకాశ మందగన్
నిత్యము నీదుకీర్తనము నేర్పెడువారును నేర్చువారు పాం
డిత్యముపొంది కీర్తిని గడింతురు వెండియు పండితాళి సాం
గత్యమువందు లీనమయి కాంతురు నిన్ను సదా సరస్వతీ!"

— × —

# శ్రీ శారదాంబ స్తోత్రము

కవిరత్న, కవిభూషణ
వసంతరావు రామకృష్ణరావు, ఎమ్. ఏ;

శ్రీవాణీ చరణారవిందముల సంసేవించి, సద్భక్తితో
భావోద్వేగము మీర కావ్యరచనా వ్యాసంగమున్ జేయగా
ధీవిస్ఫూర్తి నొసంగు శారదను నాధ్యేయంబు గావించెదన్;
భావాతీత మనోహరం బయిన సంపత్ సౌఖ్యముల్ సేకురన్।

నీ రుచిరాస్య భవ్యతర నిర్మల నిస్తుల మందహాస, శో
భా రమణీయ రూపమును భావనసేయగ శక్తిహీనుడన్
నీరవ బంధురం బయిన నీరసతన్ దొలగించి, దివ్యగం
భీరతతోడ జీవనము ప్రేమమయం బొనరింపు! తల్లిరో!

కలి తానేకదురంతమై కడు మహోగ్రంబై నితాంతంబు, సం
చలనంబై, వ్యథలన్ గలంగెడు ప్రపంచంబందు, శీతాంశు శీ
తల నేత్రాంచల దివ్యదీధితుల నీదాక్షిణ్యమున్ జూపి, లో
కుల గాపాడుము! వత్సలత్వమున! నీకున్ మ్రొక్కెదన్! భారతీ!

నిను బూజించుచు, భవ్యభావముల సంకీర్తించుచున్, నిత్యమున్
మన మారంగ భవత్పదాంబుజములన్ భావింపగా నిమ్ము! పా
వనమౌ జీవనభాగ్యమున్ బడయు, శుంభద్దృష్టి దీవించి, నిన్
వినుతింపం దగు శక్తి నాకొసగుమా! విజ్ఞానమై యొప్పగన్!

అతులంబౌ భవదీయ పాదయుగళిన్ ధ్యానింపగా నిమ్ము! స
త్కృతులన్ జేయగ శక్తినిమ్ము! దయ, నాహృద్వీధి భాసించి, స
ద్గతి సేకూర్పుము! నీకృపారసమునన్ గావ్యంబు లేపారగన్
క్షితిపై జన్మము ధన్యతన్ బడయుగా, గీర్తింతు నత్యంతమున్.

— × —

# భాషా భూష

శ్రీ వజ్ఝల కాళిదాసు

పూవుల కమ్మతావులు గుబుల్కొను నట్లు, వినీల మేఘమా
లావృతమైన అంబరమునందు తటిల్లత వెల్గినట్లు, స్వే
చ్ఛావహ పక్ష భాసిత విహంగ విహారము లట్లు, వాగ్వధూ
టీ విలసద్వికాసము నటించు కవీంద్ర హృదంతరంబులన్.

సురభి సుందర కోకిల స్వరమెకాదు, బాడబాభమౌ గ్రీష్మాతపంబు కూడ,
వానకారు పిడుగుల శబ్దములె కాదు, శారద నిశా సుధాంశు హాసములు కూడ,
పచ్చనైన హేమంత సంపదలె కాదు కృశమహీరుహ శిశిర ప్రకృతిని కూడ,
మానవత్వము కలయట్టి మనసు లందుసమముగా చూడజేయు వత్సలత వాణి!

రత్నాలంకృత సింహపీఠములు, సామ్రాజ్యాధిపత్యమ్ములున్
యత్నప్రాప్త పదార్థ సంచయ మహానందాది సౌభాగ్యముల్
నూత్నాలంకరణాదు లన్నియు నశించున్; కాని శ్రీవేదభృత్
పత్ని వాగ్విభవ ప్రపుల్ల సుకృతుల్ వర్ధిల్లు శశ్వద్గతిన్!

సుమన ఉద్భవం గంధం; ఉష ఉజ్జ్వలం మయూఖం;
తప ఉద్భాసితం బలం, మన ఉదితం కవిత్వం.

భాషా యోషామణి నీ
భూషణములుగా వెలుంగు ముల్లోకములన్
భాషానేక విరచిత శి
రీష కుసుమ కోమల బహు కృతి రత్నంబుల్.

పలుకుల తల్లి! నీదగు కృపన్ గద మానవజాతి యొక్కటే
సలలిత ధీప్రపూర్ణ సదసత్ గుణదోష విచార శీలమున్
కలిగి, స్వకీయ భావ పరికల్పన లెల్ల పరస్పరమ్ముగా
పలుకను, వ్రాయ, నేర్చె బహుభాషల; నీకివియే నమస్కృతుల్!

— × —

# సువర్ణ సుమహారము

అవధాని చక్రవర్తి, అష్టావధాని: శ్రీ బులుసు వెంకట రామమూర్తి.

శ్రీమ ద్దివ్యకళా సువర్ణమ య రాశీభూత విజ్ఞానశో
భా మాధుర్య రసస్వరూపిణీ! భవత్పాదాబ్జ సేవారతిన్
క్షేమశ్రీ విజయాయు రభ్యుదయముల్ చేకొన్న సద్భక్తులీ
భూమిన్ గాంచరె సద్యశోధనము సంపూర్ణంబుగా భారతీ!

కవితా గాన కళా స్వరూపిణీ! జగత్కల్యాణ సంధాయినీ!
దివిష ద్వందిత పాదపద్మయుగళీ దివ్యార్థ శోభాకరీ!
ధవళశ్రీయుత భాసితాంగి! నవపద్మ శ్వేతపీఠేశ్వరీ
భువనవ్యాప్త కళాప్రపూర్ణవగు నిన్ బూజింతునో భారతీ!

నాదంబే భవదీయరూపము మహానందంబు నీప్రాపు ఓం
నాదాలంకృతమై యఘంబులను సంతాపంబులన్ బాపు నీ
నాదబ్రహ్మ రసస్వరూపము భువిన్ నైర్మల్యమై నిత్యమున్
మోదించెన్ సకలార్థి దాయి యయి సంపూర్ణంబుగా భారతీ!

అరయన్ నేను నిమిత్తమాత్రుడను విద్యాదేవి వై నట్టి నీ
కరుణాలేశము సుంత లేనియెడ శక్యంబౌనె దాటంగ దు
స్తర సాహిత్య కళాసముద్ర మిది యీదన్జేసి వాగ్దేవి నన్
చరితార్థున్ దగ సేయవేడెదను నాస్వాంతంబుననన్ భారతీ!

నవసారస్వత వీథులందున మహానందంబుతో యానమున్
భవదీయాద్భుత సత్కృపాజనిత దివ్యద్రాఘవ్య నాదంబుతో
భువనవ్యాప్తముగా పరిమళములన్ ప్రోక్షించి నే సేయుగా,
స్తవనీయమ్మగు శక్తి నిమ్ము కరుణాసంభూతవై భారతీ!

జగతీ నాటక సూత్రధారిణీ! సువిజ్ఞానామృతాధ్యాయమున్
సుగమం బొప్పగ నాద జేసి భువిలో శుద్ధాంతరంగంబునన్
సుగతిన్ మంచి కళాది వర్ధములతో శోభిల్లగా పాత్రలన్
వెగడన్ జేయుము లోకరూపకము నందీపింపగా భారతీ!

ఓంకార ప్రణవ స్వరూపిణీ! జగద్యోగాను సంధాయినీ!
సంకల్పార్థ హిత ప్రదాయినీ! మనశ్చాంచల్య సంహారిణీ!
పంకేజాక్షి! జగన్మనోహరి! కళాపారీణతన్ గూర్చి నా
వంకన్ జూడవె ప్రేమతోడ జగదంబా! సత్కృపన్ భారతీ!

సాక్షా దక్షర రూపకల్పన కళా సౌందర్య సంభూతవై
ఆక్షీణంబగు సర్వశక్తుల మనోహ్లాదంబు దీపించు నీ
సాక్షాత్కార మదెట్టివారికి మహోత్సాహమ్ము చేకూర్పదే!
భిక్షాం దేహి యటంచు మ్రోలనిలుతున్ వీక్షింపుమో భారతీ!

మనముఝ్ఝాతల పుల్కరించును భవన్మాహాత్మ్యమున్ విన్న, ది
వ్య నవీనోజ్జ్వల రూపకాంతులను భావంబందు నూహించినన్
కనులం దశ్రుకణంబు జారు; ఇది నిక్కంబో జగన్మాత! యే
మని ప్రార్థించెద నిన్ను నామదిని విద్యాదేవి యో భారతీ!

అరిషడ్వర్గములన్ జయించుటకు నాకావంత శక్యంబు గా
దరవిందాక్షుల పైని కాంచనముపై యాశావిమోహంబులన్
పరిమార్పంగను లేని నామనము నీపాదాబ్జ సేవారతిన్
వరలన్ నాకవకాశ మిమ్ము జగదంబా! నిత్యమున్ భారతీ!

తలపన్ నేను మహాపరాధముల నేతన్మాత్రమున్ జంకకన్
సలుపన్ నేర్చిన క్రూరచిత్తుఁడ దురాశాపాశబద్ధుండ నా
కలుషంబుల్ పరిమార్చి తప్పుల కృపన్ కాపాడి రక్షింపుమా
జలజాతాక్షి! కళార్థదాయినీ! నమస్కారం బిదే భారతీ!

ఓదేవీ! భువనత్రయైకజననీ! ఉత్సాహ సంధాయినీ!
ప్రాదుర్భావ కళారసాత్మక జగత్ప్రజ్ఞాను సంధాయినీ!
నాదాతీత బుధైకబుద్ధి కుహరీ నానార్థ సంధాయినీ!
వేదాతీత కళాస్వరూపిణీ కృపన్ వీక్షింపుమా భారతీ!

కలమున్ కాగితమున్ కరంబునను పంకల్పించి చేబట్టినన్
ఫలవంతంబగునే? భవత్కరుణ సంపాదింపకున్నన్ మహో
జ్జ్వల సంస్కారమె నీకృపారపమునై పాలించుగాదా! జగ
ద్వలయంబందున సర్వశక్తులిడి సంభావింపగా భారతీ!

వీణాపుస్తకధారిణీ! జననీ! దేవీ! వాఙ్మయోద్ధారిణీ!
యేణీలోచనీ! సత్కళానిలయా! బ్రహ్మేంద్రాది సంసేవితా!
క్షోణిన్ నీపద పద్మరాజముల సంకోచమ్ము లేకుండ గీ
ర్వాణీ గొల్వగ శక్తినిమ్ము మనసారన్ భక్తితో భారతీ!

మాయామోహిత కర్మబంధముల నేమాయామహాశక్తినో
ధ్యేయంబంచును సర్వలోకములు తృప్తిన్ లేక బందీలుగా
హేయంబైన విషణ్ణజీవితములం దిచ్ఛారతిన్ మున్గిరం
బా! యేరీతి కృతార్థతన్ దనిపి సంభావింతువో భారతీ!

వ్యాసుండున్ మఱి కాళిదాస వరుడున్ వాల్మీకి బాణుండు దే
వీ! సాధించిరి గ్రంథరాజముల ప్రావీణ్యంబునన్ వ్రాసి శో
భా సంపత్ప్రవిలాస భాసుర యశో భాగ్యాన్వితో పేతులై
నీ సంకల్పము గల్గుమాత్రమున వారీ! ధన్యులై భారతీ!

నీసంకల్పము గల్గుమాత్రమున రాణించున్ గదా! సత్కళా
భ్యాసంబుల్ నిరవద్య సత్కళలు గ్రంథానీకముల్ ధారుణిన్
హాసోల్లాసముఖారవిందమున బ్రహ్మాండమ్ము శాసించు దే
వీ! సంధింపగ శక్తినిమ్ము కవితావిజ్ఞానముల్ భారతీ!

— x —

# శ్రీ శారదా స్తవము

శ్రీ పాటీలు తిమ్మారెడ్డి, ఎమ్. ఏ;
డా॥ శ్రీ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి, ఎమ్. ఏ; పిహెచ్ డి;

శ్రీకాంతాజమహేశ్వరాది బుధ సంసేవ్యాంఘ్రి నీరేరుహా!
నీకంటెం బరతత్త్వ మింకొకఁడు మన్నింపన్ గడుంబ్రీతి నా
వాకుల్ దోషములైన బాల్యకృతముల్ వాత్సల్యమొప్పంగ నౌ
రా కైకోక, మదీయభక్తిఁ గనుమీ బ్రాహ్మీ దయాంభోనిధీ.

అమృతము జాలువారెడు కటాక్షములన్ బ్రసరింపఁజేసి లో
కములకు నీవు జీవనము గల్గఁగఁ జేసితి వమ్మ– కాక, ని
క్కముగను నీకటాక్ష మది కల్గద నీరవ మృత్యురూప మౌ
చు మనములం గలంచదె? విశుద్ధచరిత్ర నుతింతు భారతీ.

ఈవిశ్వ మ్మఖిలమ్ము నాదమయమై యేపారుటే కాదు, తా
నా విశ్వేశుఁడు నాదరూపుఁడని యిట్లామ్నాయముల్ పల్కవే
యీవే నాదమవౌట విశ్వమును నీవే విశ్వక[illegible]మున్
దేవీ నిదె యటంచు మన్ననము సంధింతుం ద్వదీయాంఘ్రులన్.

సర్వవ్యాపకుఁడంచు విష్ణువును శాస్త్రమ్ముల్ వచించుం గదా,
యుర్విం దా బుజు వేది దాఁకిని, నోహోతల్లి, యోచింపఁగా
సర్వత్ర ప్రసరించు దానవు సరస్వత్యాఖ్య వర్తిల్లుచున్
సర్వాధిక్యముఁ గాంతు వీ విదె నమస్కారమ్ము లోకేశ్వరీ!

తావక కేశపాశమును దప్పక గన్గొని వార్షుకాభ్రమున్
భావనఁ జిక్కి, హంస పరువన్ గని వేఱొక దారి లేక, తా
నావిధి సర్వశుక్ల వగు దంచు వరంబిడి, నెమ్మి మాన్చి, య
ట్లే వడి హంసవాహనము నిచ్చెను రాయిడి నీఁగ భారతీ.

భవదీయమ్మగు శుక్లతాగరిమ విశ్వమ్మెల్ల శుక్లమ్ముకాఁ
గ విధాతృండు మరాళమున్ వెదకికోఁగాలేక మూర్ధాంతర
మ్ము విచారించి నినున్ ముఖమ్మునను సమ్మోదమ్ముతో దాఁచెఁ గా
క వెసన్ వేఱొక కారణమ్ము గలదే కల్యాణసంధాయినీ.

స్వాభావికమ్ముగ సంగీత సాహిత్య విద్యలు మృదులముల్ విశదభంగిఁ
గాని తత్తుక్కచతనుగాంచు కారణమున నవి కఠినమ్ములై యలరె జగతిఁ
గావున సహజమ్ముగాఁ గఠిన స్వభావమ్ము నీదను బ్రహ్మవచనమునకు
నలుక వహించి వాగధిదేవతవు నీవె యావాక్కునకును బాధ్యతయు నీదె

యను విధుని వాక్చమత్కృతి కలరి యతని
యాస్య సింహపీఠికఁ గొలువై జగాళిఁ
జిఱునగవు తోడఁ గాచి రక్షించుచున్న
శారదామూర్తి మాయెద సొగుఁ గాఁక

ఏదేవి సతము నర్తింప జిహ్వాగ్రాన వేదాస్యనామము విధికిఁ గలిగె
నేదేవి ఫాలమం దెపుడు వర్తింపఁగా విధునకు నమృతాంశు బిరుద మబ్బె
ఏదేవి హస్తమం దెపుడు వర్తింపఁగా కమల కావాస మా కమలమయ్యె
ఏదేవి తమకు వర్తింప నాలుకను విపశ్చితుల్ లోకైక వంద్యులైరి

అట్టి చదువులతల్లి మాయమ్మ బ్రాహ్మి
యుత్రవీధిని దివ్యవీణాకృతిఁ గొని
జనుల మ్రొక్కుల కవ్వని యను స్మితాస్య
శారదామూర్తి మాయెద సొగుఁగాక.

వసుధ లావణ్యశేవధి యెవ్వరను ప్రశ్నకీమెయే యని పల్క నెవరు గలరు
సర్వవిద్యల కధిష్ఠాత్రి యెవ్వరనంగ నీమెయే యని పల్క నెవరు గలరు,
చైతన్యదాత్రి విశ్వమ్మున నెవ్వరనంగ నీమెయే యని పల్క నెవరు గలరు,
ముగురుమూర్తులకును మూల మెవ్వరనంగ నీమెయే యని పల్క నెవరు
గలరొ,

అట్టి బ్రాహ్మీమహాదేవి యఖిలలోక
వందిత పదాంబుజాత విపంచికా స్వ
రాన జగముల నేలెడు రమ్యమూర్తి
శారదామూర్తి మా యెద సాగుఁ గాక.

ఫాలతార్తీయాక భవ్యలోచనము త్వత్త్రైకాల్యగతికి నిదర్శనమ్ము,
శిరసి స్థిత విధుండు జీవహృద్గత విచారాదు లీవనుట కుదాహరణము,
హస్తాక్షమాల మంత్రాధిదేవత వీవయని నిరూపింపఁగ నైన గురుతు
కచ్ఛపీ నిర్గత క్వాణమ్ము శబ్దప్రపంచాధిపత్య ప్రభావముద్ర

సర్వశుక్లత్వము త్వదీయ స్వచ్ఛగతికి
తిరుగులేని తార్కాణమా పరమమూర్తి
తావకీన మస్మాకీన భావమునను
సంతత మొనర్చుఁ గాత లాస్యములు తల్లి.

ఒకకరమందుఁ బుస్తకము నొక్కకరమ్మున నక్షమాల మ
స్తకమున సూర్యదీధితులఁ దన్ను కిరీట మురమ్మునన్ మణి
ప్రకరముపెల్ల మిక్కిలి కరమ్ముల నిక్వణవ క్వణ ద్విపం
చిక నినదాల మోహితులఁ జేయు మదంబను గొల్తు శారదన్.

అనుదినము భక్తి నీశారదాష్టకమ్ము
నెవ్వఁడు పఠించువాఁడు బ్రాహ్మీముహూర్త
మందు, నాతని జిహ్వాగ్రమందు బ్రాహ్మి!
యమితవాత్సల్యము నను లాస్యములు సలుపు.

భక్తితోఁ దన్నుఁ గూర్చి స్తవమ్ముఁ గూర్చు
రెడ్డి శాస్త్రుల నిర్వురఁ బ్రీతితోడ
నరసి యన్యోన్యమా జీవితాంత మలర
నాశిషమ్ముల శీర్షములందుఁ గురియు.

— × —

# శ్రీవాణి

శ్రీ మూవుడూరు రఘురామయ్య

వ్యాస వాల్మీక కాళిదాసాది ప్రముఖ
కవుల పాలిట కొంగుబంగార మగుచు
సురుచిరమ్మైన సాహిత్యసుధలు వసుధ
వరలజేసిన భారతీ! వందనములు!!

నన్నయ తిక్కయజ్వయు గుణాఢ్యుడు భక్తవరేణ్యు డైన - పో
తన్నయు నెల్లనార్యుడును దద్దయు బెద్దన యాదిగాగ పే
రెన్నికగన్న సత్కవుల నెంచి సదాకరుణించి పూజలం
గన్న దయాకృతిన్ హరికి గాదిలి కోడలి నంజలించెదన్!!

అందము లొందజేయు వివిధాభరణమ్ముల తీసినంత నీ
యందము తగ్గునే మధురసాంబుధి దేలిననాటి వైభవ
మ్మందగ లేక కొత్తదగు మార్గము కొందరు బట్టి రింక నే
యందము దానిదే గద మదంబ! విశాల జగంబు నందునన్॥

ఛంద స్స్వర్ణడోలల
నందమ్ముల నందె తల్లి యానాటిభువిన్;
ఛందమ్మే బంధమ్మని
కుందుచు నున్నారు నేడు కొందరు మనుజుల్.

చదువు కళలు జగంబుల సంతరించి
జనుల గాపాడు దివ్యప్రశాంతమూర్తి!
సహృదయవికాసమూర్తివి సదయ వీవు
వనజభవురాణి! శ్రీవాణి! ప్రణుతి నీకు

— x —

# శ్రీ శారదా స్తుతి

కవితాకౌముది; కవితాకోవిద
శ్రీ పరిటి సూర్య సుబ్రహ్మణ్య శర్మ

అనయము మామకీన హృదయాంబుజ పీఠమునందు నిల్చి, భూ
జనములు మెచ్చ, సత్కవులు సంతసమందఁగఁ, బండితవ్రజం
బొనరువగాఁ బ్రశంసలు సమున్నతమౌ గతి, నాదునాల్కమీఁ
ద నిలిచి తేనెలూరు కయితన్ వెలయింప గదమ్మ శారదా!

కన నన్నయ్యకవీంద్రుమీఁదఁ బయిఁ దిక్కన్నార్యుపై, శంభుదా
సునిపైఁ బోతనమీఁదఁ బెద్దనపయిన్ సూరన్నపై, ముక్కతి
మ్మనపైఁ జూపిన సత్కృపారసధునీ మాధుర్య సంపత్తి పె
ల్చన నామీఁదనుగూడ జూపగదవే బ్రాహ్మీ కృపాంభోనిధీ!

కరములు దోయిలించి, త్రిజగమ్ముల రాణకు నెక్కినట్టి నీ
పరమకృపారసంబు నొకపట్టున నాపయి నిల్పితేని సుం
దర మకరందబిందు సముదాయము దొప్పగ దోగు నట్లుగా
విరచన చేయనే కృతులు వీనులవిం దగునట్లు భారతీ!

సిరిని భజించువారలకు చెల్వగు సంపద లెన్నొ కల్గు నీ
ధరపయి నేఁటిపుట్టువునె; తద్దయు నీకృపగల్గు వారికిన్
జిరతర కీర్తిచంద్రికలు చెల్వగు మోక్ష సుఖానుభూతులున్
గరతలమందు గ్రుంకసిరికాయల రీతి గదా సరస్వతీ!

జనతారాధిత పాదపద్మములతో, సంగీతసాహిత్య సు
స్తన కుంభద్వయితో, సదాయుపనిషత్కాంతా వ్రజ శ్రేణితో
ననలం బోలెడునట్టి మానసముతో నాణ్యంబుగాఁ గచ్ఛపీ
స్వనమాధుర్యము జిల్క నీకిదె నమస్కారంబు వాగీశ్వరీ!

— x —

# కవితల కల్పవల్లి

శ్రీ కోపల్లె రామమూర్తి

శ్రీవిద్యా రూపిణీ వౌ
పావన శబ్దాత్మ వీవు వందిత హృదయా
భావాసిత శారదః నే
నీవాడను నమ్మ గావు నిండిన కరుణన్.

నాటికి నేటి కింక మరునాటికి నిన్ను మనంబు నందునన్
నాటిన భక్తిమై కవిజనంబులు పూజలు సల్పుకున్న నీ
వేటికి వారివాక్కునను విశ్రుత సుందర సాధు శబ్దముల్
మాటికి నిత్తువమ్మ, కనుమా నను భారతి భక్తి మ్రొక్కెదన్.

కవిబ్రహ్మ తిక్కన్న గంటమ్ముకొన నుండి జాలువారిన యట్టి చదువులమ్మ
కవిసార్వభౌముండు, కవిరాజు శ్రీనాథు వాక్కున నిల్చిన వాణివమ్మ
పోతనామాత్యుని పొత్తంబులో సారశబ్దంబులై పొంగు శారదాంబ
త్యాగయ్యకంఠాన తారాడు నాదమై పరవళ్ళుత్రొక్కిన బ్రాహ్మివమ్మ

వందనము చేతు నోయమ్మ – అందుకొమ్మ
కోరి నాదువాక్కున నీవు కొలువుచేసి
కలము నాచేత పట్టించి క్రమగతుల
కవిత నడిపింపవే తల్లి కల్పవల్లి.

మ్రొక్కెద నమ్మ నీకు, నగుమోమున దీవెనలీయవమ్మ నా
వాక్కున నిల్వుమమ్మ, నినుభక్తిని నిత్యము గొల్తునమ్మ ఓ
చక్కని సీలవేణి, సరసత్వపు పల్కుల కీరవాణి, నీ
వెక్కడనున్న గాని, పలువిద్యలు పండెడి రాణి వాణిరో.

— x —

# ప్రభాతి

శ్రీ ఎస్. శ్రీనివాసరావు

ఊకువపొదుగా, ఎరుపు ఓజగ మేలితలంపు సంచముల్
జోకగ, పల్కులో విలువ చొప్పడ, కూరుపులోన హాసయున్
ఏకననెత్త, కైతమున ఏమట తెల్లముకాగ, పొత్తము
తో: కుదురైన నేరిమిని తోడన మా కొనగూర్చ వేడెదన్.

ఓ జగమేలు తల్లి! నుడినొద్దిగ దీర్చెడి తాయి! పొత్తువా!
ఓ జల చేగయున్ వెలుగు నోమెడు చల్లని వెల్ల యైదువా!
సొజపు గైతతో దొనరు, సజ్జక మివ్వగ, తూటిగా సపుం
దేజి గలట్టి జేజె! కడు దీవెనకోలును చేతు మాదటన్.

తఱుగని కూర్మితో తబిసి దంటల కెల్లయు తల్లివేల్పువై
ఎఱుకకు కందిలై తలపులేడ్తెఱ సాగిన తీరులోన, కై
సరులకు ఈగి మానునయి, జానువు నందిన తల్లి! నేడు మా
సరబడి నిల్వుమమ్మ! కెలవమ్ముగ నీగుడి మా యెడందగా!!

# భారతీ స్తవము

శ్రీ హరి శివప్రసాద్

విఘ్నేశుఁ బూజింప విఘ్నమ్ము లెడబాపి కార్యసిద్ధి నొసంగు కరుణ తోడ,
విష్ణు నారాధింప విభవమ్ముల నొసంగు ముక్కంటిఁ బూజింప మోక్ష మిచ్చు
శ్రీరాము భజియింప శ్రీ భక్తహనుమంతు డండగా నిలుచుండి అభయ
మిడును,
శ్రీదేవిని నర్చింప సిరిసంపదల నిచ్చు చంద్రుని వేడంగ సౌఖ్యమొసగు,

విద్యలెల్ల నొసంగెడి వేల్పువనుచు,
సాహితీప్రియుల్ నుతియింత్రు జనని! నిన్ను
కవిగ వెలుగొందు వరమిచ్చి కావు మమ్ము
నన్ను, భక్తిగొల్చెద నిన్ను నలువరాణి

# నమస్తుభ్యాం

శ్రీ వెల్చేటి అనంత ఉమాశంకర్ ఎమ్. ఏ;

మీటెనా! యొకమారు మేటి బంగరు వీణ ఓంకార నాదమ్ము ఉద్భవించు,
పలికెనా! యొకమారు పసిడి పల్కులయందు సరసకవిత్వముల్ జాలువారు,
నవ్వెనా! యొకమారు నల్గడల విహారములనల్ప వెన్నెల పులుగు లెలమి
వడచెనా! యొకమారు నవరత్న మంజీర నాట్యశాస్త్రార్థ విన్యాసమొలుకు

చూచెనా! కృపారసపూర్ణ సుధలు గురియు
దివ్యరూపిణి భారతీ దేవి! నిజము
కవులకల్పక మ్మాతల్లి కరుణ జూపి
కలికి పలుకుల నిడుత మా కలములకును.

వాల్మీకి మోమున వాగ్రూపమై నిల్చి రామాయణమ్ముగ రమణ వెలసి,
వ్యాసుని కలమందు భాసురమ్ముగ నిల్చి భారతమ్ముగ భువి పరిఢవిల్లి,
కాళిదాసుని జిహ్వఁ గరుణతోఁ గొలువుండి సత్కావ్య సంపదల్ జగతికిచ్చి
నన్నయఁ దిక్కన నన్నెచోడుల మెచ్చి మధురాంధ్ర కవితగ మహిని దనరి

సరవి కవిరాజ సత్తముల్ సన్నుతింప
కమలమందున నెలవున్న, కలువ కంటి
ఆదరమ్మున నోడి జేర్చి అభయమిచ్చి
కలికిపలుకుల నేర్పు మో పలుకులమ్మ.

# సరస్వతీదేవి ప్రార్థన

శ్రీ కుప్పిలి సన్యాసిరావు

మ॥ ఘనయు ష్మత్కరుణా రసామిళిత దృక్కంజాత సంవాసనన్।
జననీకాద్యె, సమస్త సత్కవులు వాచా ప్రౌఢిమన్ గాంచుటల్।
తనరంజేయుము దత్కృపారసము చిందంజేసి మేల్ ధన్యుగా।
ననిశంబున్ ఘననీలవేణి! శుకవీణాపాణి! వాణీ! ననున్॥

# సాహితీ సరస్వతి

శ్రీ నేతేటి వాయునందన శర్మ

మేలి తెలిపట్టుపుట్టముల్ మేనఁగట్టి। మణిగణ ఖచిత భూషణ క్వణనమెసఁగ
వజ్రివల్లకీ పాణివై వరగు నీకు। సాహితీ సరస్వతి! నమస్కారమమ్మ!

దొరల పేరోలగముల పొత్తులనె గాక। తద్విముఖ కవీశ్వర కుటీతటులఁగూడ
తొడవు సొబగులు మును నీవు విడువలేదు। ఏలకొ నిరస్తభూషవై తిపుడుతల్లి.

క్రొత్తపోకడ పేరిటఁ గొంకులేక। తొల్లిటి జిలుంగు బంగరు తొడవు లెడలి
వెట్టిమొట్టి నినాద కవిత్వ సరణి। శూన్య చరణాలఁ దడఁబడుచుంటి వకట!

రమ్యహర్మ్యాల విహరించు ద్రవిణపతులు।
పాన శయన వాహనయాన పరత నెపుడు
గొప్పలకుఁ బోదురే కాని కొంచెమైన।
నెంచి నీస్థితిగతులు పట్టించుకోరు.

పొట్ట చేతను బట్టుకపోవుపేద। ప్రజల గ్రాసవాసోద్దైన్యభరము బాప
నెంత దిగఁజారిపోయిన, నేమి నీవు। కోరి నినుఁజూడ నెవఁబ్రోకలేరువారు.

మధ్యవర్తి మహాశయు మాన్యులొకరె।
ప్రజల స్పృహలేమిసాంఘికరుజలు చూప
సరసమైన బ్రాహ్మీభేషజము లొసఁగి।
పత్రికల నింపుదురు పెక్కు ప్రకటనములు

"గంగదాసు" మహాకవి పుంగవునకు। సాటియగు మేటిసుకవుల ధాటిపెరిగె;
కాళిదాసుని కవితాత్మ కలుగునటుల। వారి నాల్కల లిఖియించి వరలుమమ్మ"

అన్ని తెగలవారలు ప్రాజ్ఞులై రహింప। నజ్ఞతను గాక విజ్ఞతనైక్యవరచి
పలుకులవెలంది! నీ కూర్మి చిలుకరింపు। తెంపులేకుండ పెంపుఁగావింపుమమ్మ"

— x —

# నవమౌక్తికము

సరసకవితా విశారద, మహాకవి

శ్రీ ఎన్.ఎమ్. సహాయాచారి. బి.ఓ.ఎల్

జయతు జయతు మాతా! దివ్యవాణీ సమేతా!
జయతు జయతు భద్రా! సచ్చిదానంద ముద్రా!
జయతు జయతు భాషా! సత్కవీశోక్తివేషా!
జయతు జయతు వాణీ! రమ్యరోలంబవేణీ!

జయతు జయతు పూజ్యా! సత్కళాప్రాజ్యరాజ్యా!
జయతు జయతు ప్రాజ్ఞీ! ధాతృహృద్దేశరాజ్ఞీ!
జయతు జయతు వీణావాద్య విద్యాప్రవీణా!
జయతు జయతు వాణీ! రమ్యరోలంబ వేణీ!

జయతు జయతు! దేవస్తుత్య దివ్యప్రభావా!
జయతు జయతు! శక్తి-శాటంకయుక్తా!
జయతు జయతు! విద్యా! వేదవిద్యానవద్యా
జయతు జయతు! వాణీ! రమ్యరోలంబ వేణీ!

శ్రీ వాగ్వైభవ శేముషీవిభవ మాశీఃశ్రీల జోడించి, నా
దౌ వాగ్రీతిన్ గరుణించి మెచ్చికొను చా యా పొందితిలోకమం
దేవైషమ్యము లేని కబ్బముల వ్రాయింపించి మన్నించు నా
దేవిన్ ప్రౌఢసరస్వతిన్ మదిని హత్తింతున్ సదా భక్తిమై

ఏబదార్వర్ష సంపుటి నింపు నింపు
తేటతేనియ మాటల తెనుగు వాణి
పలుకుతీపి ముత్తియగుత్తు లలర జేసి
మద్రసనపయి నటియించి మనుచుగాత

లలిరాయంచయె వారువంబునయి, కళ్యాణోక్త శుభ్రాంశుడున్
దలపువ్వై చెలికత్తె చిల్కయయి, వేదంబుల్ విహారంబులై,
పలుకందోడు విపంచియై, కవుల సద్భావంబు లద్దంబునై,
తెలిదమ్మిన్ దన గద్దెగా గొనెడి వాగ్దేవిన్ మదిన్ గొల్చెదన్.

చెలియ కనులలోని చెలువమ్ము తనజన్మ
కారక కమలమ్ము జ్ఞప్తిసేయ,
నతియొనర్చ ఆత్మనాథుని గని నవ్వు
పువ్వులెగయు వాణి బ్రోచు గాత!

కమ్మని గుమ్మపాలు కవికల్పిత కావ్య సుధారస ప్రసా
రమ్మయి; గేయకావ్య విసరమ్ముల నాదము భృంగపాళి ఝుం
ఝుమ్మను గీతికావితతి చొప్పున దోప; రస ప్రపంచ స
ర్వమ్ము వినిర్మితిన్ బొనరువన్గల రాణిని వాణి నెన్నెదన్

అలకాళిదాస గజాంకుశములుగాక। మల్లియన్ గుది గ్రుచ్చు మహితులుండ
పినవీరభద్రుని బింకంబు సడల న। చ్ఛాంధ్రవిస్ఫూర్తి: జక్కన్నలుండ
కాపుకవితలంచు కంగులు దినిపింప। కద్దిరా యనిపించు పెద్దలుండ
హరిజనుండం చీసు నందక బంగరు। గగ్గెరలిచ్చు వెంకన్న లుండ
వచ్చుగడ్డివేయ భగ్గునమండని। కవిరసజ్ఞ వందితవరులుండ
కూర్మినాంధ్రియింట కొలువు సేసిన వాణి। విభవ వైభవంపు వఖల జిమ్మె.

— x —

# నలువరాణి!

శ్రీ కా.వే.శో. రఘుపతిరావు

శ్రీ రమాగణేశ సహ పూజితే సదా!
శబ్దశాస్త్ర నిగమ శోభితేచ!
శారదేందు ధవళ శుభ్ర వస్త్రాన్వితే!
శారదే కురు కురు శుభశతాని,

జీవరాశినెల్ల సృష్టి జేసినవాని
వదనముల వెలింగి వసుధకెల్ల
జ్ఞాన దీప్తులొసగు జననివి నీవమ్మ
నలువరాణి! భక్తి గొలుతు, నిన్నె

పాలు నీరు గలుప పాలనే గ్రోలెడు
మదమరాళి భంగి, ముదముతోడ
నిన్ను గొలుచు జనుల నెమ్మది కీయవె
సత్య మరయు శక్తి! శారదాంబ

విమల వర్తనమిదు, విద్య నేర్వనివాడు
వింత పశువె గాన పృథ్వియందు
విద్య యొసగి ప్రజల వినయ వివేకముల్
వృద్ధిజేయుమమ్మ! విమల చరిత!

సర్వవిద్యలకును జగతీ తలమ్మున
స్థానమీవె గాన శారదాంబ!
పండిత కవివరులు, పామరులును మెచ్చు
కవిత నాకునిమ్ము! కరుణతోడ

—o—

# "తల్లీ నిన్ను దలంచి...."

కవిభూషణ శ్రీ గణపతిరాజు అచ్యుత రామరాజు

వీణాభూషిత రమ్యపాణీ, జననీ, వేదాధ్వ సంచారిణీ,
క్షోణీ ద్యోస్థిత శబ్దరూపము, శిరః కోటీర మాణిక్యరుక్
శ్రేణీశోభిత దిగ్విభాగ, విలసత్ శ్రీరమ్య చిద్భూమిపీఠీ,
వాణీ! కూరిమి స్వీకరింపగదె మత్పద్య ప్రసూనాంజలుల్.

నిన్ను దలంచి నెమ్మదిని నేర్పుగ సన్నుతి సేయనెంచ నా
యన్నలు మున్నె వాడుకొని రమ్మ! మనోజ్ఞపదమ్ము లన్నిటిన్,
నన్నొక పేదమానిసి 'అనాదిని' జేసిరి పోతనాదు;లే
మున్నను వారువాడినవె యున్నవి నాసరి వాంధ్ర కీర్తరిన్.

అయినన్ గాని అదేసమంజసము న్యాయంబౌను వారోనినున్
నయమొప్పారగ నెల్లప్రొద్దులను ధ్యానంబందు సంధింపగా
దయతో దన్పితి వీవు సూక్తిసుధలన్ తల్లీ! యదే రీతి నీ
దయ జూపింపుము పాలపావడను గాదా నేను నీ బిడ్డడన్-

మాటలురాని బిడ్డడను; మాతవు నీవు జగమ్ము లెల్లెడన్,
గోటను కచ్ఛపీశ్రుతుల కొంచెము మీటియె వేదధర్మముల్
చాటుదు; నీ చరణసన్నిధి వ్రాలిన నన్ను బ్రోవ నే
పాటిది, చేయిసాచి నను పాదము లంటగనిమ్ము భక్తిమై.

కోరను వెండికొండలను, కోరను మల్లెల చందమామలన్,
కోరను పాలసంద్రమును, కోరను కల్పక కామధేనువుల్,
కోరిక లెల్ల దీర్చి నను కూరిమి నారయు సర్వశుక్లవో
శారద! నీ కృపామృత రసాదర హాసలవమ్మె కోరెదన్-

హృదయంబందును నాల్కయందు కనులం దీవీనులన్ నాసికన్
పద హస్తమ్ముల నాశరీరమున నిశ్వాసమ్ములందున్ శుభా
స్పద శక్తిప్రద సంతతాభ్యుదయ సంపత్శ్రీలు సేకూర్చి నీ
సదయాపాంగ సుధాప్రసారముల రక్షల్ సేయుమో భారతీ

—o—

# శ్రీ శారదా మహిమ

డా. మోడేకుర్తి వెంకట సత్యనారాయణ ఎమ్ ఏ; పి హెచ్ డి,

సీ॥ పంచాశదక్షరవాగీశ్వరీ! మాత!
అక్షరమాలతో నలరుదీవు,
అక్షరబ్రహ్మంబు నవగతంబును జేతు
వెవడు మదిని నిన్ను వేడుచుండు,
నీ మంత్రజపమును నిష్ఠతోఁ జేసిన
వేద వేదాంగాది విద్యలందు,
సర్వకళలయందు సత్పాండితియుఁ గల్గు
ఓ సరస్వతి! మాత! ఓజమీవె,
బ్రహ్మవిద్యాప్రాప్తి బ్రహ్మ పదంబును
శారదా! నీ కృపన్ సంభవించు,
కవి కుమారుల కావ్యకల్పనా సుమముల
వికసింపజేయు కల్పకము నీవె,
సర్వమంత్రార్థముల్ సర్వతత్త్వంబులు
నీవె తెల్పుదు, వాణి! నిన్నుఁగొల్వ,
లౌకి కా లౌకిక లావణ్యము ప్పెడి
వాక్సుధ నొసగెదువాణి! నీదు

ఆ.వె॥ మంత్రితంత్ర యంత్రమహిమ లెల్ల నెఱిగి
సత్త్వగుణయుతుండు సాధకుండు
స్వస్వరూప మెఱుఁగు శారదాంబా! నిను
నిష్ఠతోఁ గొలిచిన నిరత మతఁడు

—o—

# వాణీస్తుతి

శ్రీ కాశూరి వెంకట నరసింగరావు

శారదః గానఘూర్ణిత విశాల కళాబ్ధి తరంగ డోలికా
చారు విహారిణీః నవరస ప్రసరన్మధు వాగ్ఝరీ మహో
దార శ్రుతిస్వరూపిణీ, విధాతృహృదంతర మోక్షచిన్మయు
ద్వార నివాసినీః వలికెదన్, భవదీయ కటాక్షరేఖలన్.

పావనమౌనిశాసితము భారతసంస్కృతి, అందునెందఱో
జీవితముల్ కళార్పితముచేసిరి వ్యాసులు పోతనల్ రసా
ప్లావితకావ్యఘట్టముల, పల్కులు తావకపాదనూపురా
రావము ఘల్లుఘల్లున పురాతన సృష్టిరహస్య మట్టి వా
గ్దేవి అనుగ్రహింపు ప్రణుతింపగ దివ్యపదార్థ భావనల్.

జ్ఞానములేదు తాత్త్వికవిచారమురాదు; దివంబునన్ సుధా
పానములేని అప్సరసభంగిని స్థానములేక ఐహికో
ద్యానమునందు మోహమమతాధనవాసన లాని మోక్షసం
స్థాన విహీన దీనజనతాపథ పాంథుడనై తపించెదన్.

పూవులతావు లీనవలె పోకడలన్, మహనీయ భావముల్
దీవులబోలె తేలవలె, తీరములేని కవిత్వ వారిధిన్
టావులు వాకలూరవలె, పల్కులలో మధువుల్ భవత్కృపా
శ్రీవశతన్మయత్వమున సేవయొనర్పగ నీపదాబ్జముల్

పంచమ పద్యసంస్మరణ భారతిభక్తివిపంచి మీటగన్
మంచిమనోరథమ్ములు విమానములై పయనించి, బ్రహ్మలో
కాంచలముల్ గమించి బహిరావరణమ్ములదాటి తిన్నగా
కాంచననగర్భురాణీ పదకంజసమీపములందు వ్రాలెడున్.

—o—

# సరస్వతీస్తవము

శ్రీ ఎమ్.టి.యస్. రాజు

శా॥ శ్రీవాణీ! భవదంఘ్రియుగ్మ మెదలోఁ జింతించి నిన్వేడెదన్
నీవాత్సల్యకృపాకటాక్షముల నన్నిత్యంబుఁ గాపాడుచున్
నీవే మద్రసనాగ్రవర్తివగుచున్ నిర్మింపగాజేయు మీ,
వేవేల్పద్యముల న్సుధాఝరులటుల్ విద్వజ్జనుల్ మెచ్చగన్.

ఉ॥ నీ దయుగల్గు సత్కవుల నిస్తులభాగ్యము రాజరాజులున్
మేదిని నందనేర్తు రొకొ? మీరిన వాగ్విభవంబు సొత్తుగాన్
సాదర పూజ్యభావముల సర్వజనుల్ వినుతింప త్వత్కృపా
సాదిత సద్యశోవిమల చంద్రిక లెల్లడఁ బర్వు, భారతీ!

సీ॥ పరమేష్ఠిజిహ్వాగ్ర పథమున వసియించు వనితామ తల్లియే వారిజాక్షి,
శ్వేతహంసంబుపై స్నిగ్ధాంబరయుతయై యలరారుచుండు నేయలరుబోడి,
వీణనుచేబూని వేదని క్వాణముల్ వేడుకబాడు నేవిద్రుమోష్ఠి
రాకేందుజితలసల్లావణ్యపద్మాస్య విహరణా నందితేందిందిరకచ,

గీ॥ అట్టిశారద వాగ్దేవి, యమరనాథ
బ్రహ్మవిష్ణీశముఖ లేఖవరనుతాంఘ్రి
విమలకీర్తిజ్యోత్స్నాకీర్ణ విశ్వచక్ర
నాదుజిహ్వాగ్రవర్తియై నాట్యమాడు.

మ॥ ధవళాంభోరుహపీఠమధ్యగతవై తంత్రీనినాదంబునన్
భువనానంద మరంద గానసుధలన్ మోదించు నిన్ డెందమం
దవలోకించి యనన్య భక్తిగొలుతున్ తల్లీ! కృపన్బ్రోవుమా!
కవివిద్వజ్జన పక్షపాతివిగదా! కైవల్యదా! శారదా!

—o—

# భారతీస్తుతి

శ్రీ కాశిరాజు వీరరాఘవరావు.

కమలభవు నాస్యములనుండి కదలివచ్చు వేదనినదమ్ములకు కచ్ఛపీ మనోజ్ఞ
గానముల శ్రుతిగల్పి జగచ్ఛుభమ్ము లిచ్చు వాణి నన్నాశీర్వదించు గాక.

శతసౌదామిను లేకమై మెఱయు, నీసాక్షాత్కృతిన్ నిశ్చల
స్థితి వీక్షింపగజాల మోజనని నీ దివ్యప్రశాంతాకృతి
ద్యుతిసందోహము కన్నుదోయికిని విందుల్ సేయ వాత్సల్యసు
స్మితవై దర్శన భాగ్యమీయగదె బ్రాహ్మీ! చిత్కళారూపిణీ!

నీ కృపారసఫలమయి నెగడు నట్టి సరస సాహిత్యకృతుల నా శక్తికొలది
సంస్తుతింప దలంతును సంతతమ్ము శారదా! నిను నా హృదబ్జమున నిల్పి.

సురభిళముల్ మనోజ్ఞములు సుందర భావసరోజముల్ సదా
విరియు మదీయహృత్సరసి వీథుల యందు మరాళవాహవై
సరస విలాససంపద లెసంగ విహారమొనర్పవే నిరం
తర కవితా సమభ్యుదయ దాయినివై జననీ, సరస్వతీ!

అక్షయ సారస్వత విభ
వాక్షరమయ దివ్యసుందరాకారిణి! నీ
దాక్షిణ్యమె మాకనుదిన
రక్షా శ్రేయమ్ము లొసగి ప్రాపగు గాతన్

—o—

# శ్రీశారదాష్టకము

శ్రీ పా.తి.గు.వేం. రంగాచార్యః
ఎమ్.ఏ (తె). ఎమ్.ఏ (సం). బి.ఓ.ఎల్; పి.ఓ.ఎల్.

శా న్తాంత్వాం శుభ్రవసనాం భక్తానామిష్టదాయినీమ్।
విశ్వమానవరక్షాయై, (ర్థం) శారదామాతరం భజే॥

ర జోగుణాది విముక్తీమ్, సదాసత్వాతి శాయినీమ్।
విశ్వమానవరక్షాయై, శారదామాతరం భజే॥

దా త్రీం వినయదాత్రీం త్వాం, సర్వేషామార్తి హారిణీమ్।
విశ్వమానవరక్షాయై, శారదామాతరం భజే॥

మా యామయీం ప్రసన్నాంత్వాం కామరూపానువర్తినీమ్,
విశ్వమానవరక్షాయై, శారదామాతరం భజే॥

త పఃసిద్దాః వయోవృద్ధాః సదాసంప్రార్థయన్తిత్వాం।
విశ్వమానవరక్షాయై, శారదామాతరం భజే॥

రం జయన్తీం మనశ్శక్తిం భంజయన్తీం దురాగ్రహమ్।
విశ్వమానవరక్షాయై శారదామాతరం భజే॥

భ వ్యాందివ్యాం సుబోధాం త్వాం సదాశిష్టైః సుపూజితామ్।
విశ్వమానవరరక్షాయై శారదామాతరంభజే॥

జే గీయమానసప్రతిభాం సర్వలోకైక పూజితామ్।
విశ్వమానవరక్షాయై శారదామాతరంభజే॥

యే పఠన్తి ప్రభాతేచ దివ్యం శ్రీ శారదాష్టకమ్
లోకద్వయే నిశ్చయేన కీర్తి విందంతి తేనరాః ఇత్తమ్

—o—

# చదువులతల్లికి అంజలి

శ్రీ ఘండికోట బ్రహ్మజీరావు
ఎం.ఏ (తెలుగు) ఎం.ఏ. (సంస్కృతం)

ఓనామాలను దిద్దబోవుటకు ముందోతల్లి నీ స్తోత్రమున్
జ్ఞానానంద గుణార్ణవా! విబుధవిజ్ఞానాను సంధాయినీ!
గానమ్మున్ సలుపంగ నేర్చితిని నా కంపించు కంఠమ్ముతో;
ఆ నాదమ్ము మనోజ్ఞమై మధురమై వ్యాపించె బ్రహ్మాండముల్.

నా మదిలోని ఊహలకు న్యాయముసేయ దలంచి వ్రాసితిన్,
ఏమని లోకులా రచన లెంచినవారలొ, చెప్పమందువా,
భామిని! నీ మహాకరుణ పాత్రతనిచ్చెను వాటికన్నచో
క్షేమము-లేదు నాప్రతిభ- కీర్తిని కొందలమంది కోరితిన్

వ్రాయుటకేమిగాని, మునువ్రాసిన కావ్యములన్ పఠింపగా
తీయని భావనల్ మదిని తేనెల వాకలుగానదించు; ఏ
గాయక సార్వభౌము మృదుగానమొ కర్ణపుటమ్ములందు చాం
పేయసుభూషణమ్ముగను ప్రేలును, తల్లి యనుగ్రహమ్మునన్

పూవులలోని మెత్తదనమో మలయాచల మందవాతమో
మావిచివుళ్ళుమేసి మధుమాసపువేళల పంచమమ్మునన్
కోవెలతోటలో కొసరి కూసెడు కోకిలపాట అందమో
దేవి, సరస్వతీ! ప్రియముదెచ్చును నీకు పఠింప గోరెదన్

తల్లీ ఏ సుముహూర్తమందు మమచిత్తక్షేత్రమున్ సాహితీ
వల్లీ బీజమొకండు నాటితివొ, అవ్యాజానుబంధమ్ముతో
అల్లెన్ నేడది పుష్పవాటికను నేత్రానంద సంధాయియై
ఫుల్లాబ్జానన తత్ సుగంధములు నమ్మించన్ రసజ్యోత్స్నలో

—o—

# ఫలశ్రుతి

నీపూజాకీర్తన లీ యపూర్వకవితా నీరాజనమ్ముల్, కళా
దీప్రాభాశ్రిత రమ్యకాంతు లమరత్తిన్ సర్వదిక్సీమరే
ఖాపర్యంతము పర్వజేయుత భవత్కారుణ్య సౌరభ్య వీ
చీపూరమ్ములు దేవి! నీ పృథుయశ శ్శ్రీఖండ మాధుర్యముల్.

సారవిదగ్రగణ్యపరిషత్ప్రథయిల్త్రిరసవత్కవిత్వ దీ
క్షారభమాణు లీ కవులు సల్పిన పూజలు నీ కృపామృత
శ్రీరుచిరమ్ముగా తెలుగు సీమల నద్దెసలందు మేలిబం
గారపుపంటలై వెలయుగావుత మామధురాంధ్ర సాహితిన్.

అలరుందేనియ యన్న కీరితికి తా వైపొల్చు స్వాదుత్వ మీ
తెలుగుంబద్యము నోచుకొన్న దిటు లర్థిన్ నేడు నీపాదపూ
జల కీ సుందరకావ్యరూపమున; యుష్మత్కీర్తి రేఖాసుగం
ధిలసుశ్రీయిది విశ్వసాహితికె వన్నెల్ దీర్చి వర్ధిల్లుతన్లు.

నీ సంస్తోత్రము లెల్ల భక్తుల కిలన్ నిర్వేలనిశ్శ్రేయస
శ్రీసౌభాగ్యము లాయురున్నతులు వాసిం గూర్చి రక్షించుతన్;
నీ సేవాఫలముల్ కవీంద్రకృతు లున్నిద్రోరు సాహిత్య శో
భా సర్వస్వములై జగజ్జనని! విశ్వశ్రేయముల్ కూర్చుతన్

జయ! సారస్వత దుగ్ధవార్నిధి శరచ్చంద్రద్యుతిశ్రీభారతీ,
జయ! సాహిత్యకళాతపస్విజనతా సంక్షేమ దీక్షావ్రతీ,
జయ! చిద్రూపకళాకృతీ, సకలవిజ్ఞానైక తేజోవతీ,
జయ! వాగీశ్వరి, విశ్వశాంతిసుఖ భాస్వద్భాగ్య సంపత్కృతీ..

—౦—

# శారదాంబా స్తుతి

డా॥ శివలెంక ప్రకాశరావు
ఎమ్. ఏ; పి హెచ్. డి.

నీ నామ భాషనే నిఖిలలోకములందు
తాపత్రయాదుల బాపునమ్మ
నీపాద పూజయే నిత్యమ్ము శుభమిచ్చు
సద్గతులందించి సాకునమ్మ
నీ మంత్ర జపమొక నిశ్చలతత్త్వమ్ము
నొడగూర్చి సంతసంబొసగునమ్మ
నీరూప దర్శనంబేరీతి కలిగినన్
జన్మ సార్థకమొంద సత్యమమ్మ
అట్టి నిన్ను హృదయపీఠమందు నిలిపి
షోడశోపచారములఁ బ్రస్తుతిని సలిపి
విమలభక్తి భావమెదను పెంపుమీర
సన్నుతింతు సంతతము నే శారదాంబ!

నిన్నెవ నమ్మినాను కరుణింతు వటంచు, నిలాతలంబులో
నన్ను మహాకవీశుడను నామమునందగ జేతువంచు, నా
సన్నుతిగాంచి సంతతము సంతసమిచ్చియు గాతువంచు, నా
పన్న శరణ్య! బ్రోవుమ, అపార కృపారన దృష్టి శారదా!

నిన్ను దలంచినంత వరణీయపదాంచిత భావమేదొ నా
కన్నుల గట్టినట్లు చిరకాలమెదన్ గదలించినట్లు నా
కెన్నడొ ఆ స్వభావతరుణేందు వికాసవిలాసలాస్యముల్
చెన్నువహించి స్వీయముగ సేకురినట్లుగ దోచు శారదా!

— ० —

# శారదా స్తుతి

శ్రీ పైడిపాటి సుబ్బరామ శాస్త్రి

అమ్మా, శారద! నీకు నర్ఘ్యమును, పాద్యం బిచ్చెదన్, ప్రీతి, కై
కొమ్మా! యాచమనీయమున్ మఱియు, నీకున్ సేతు నైవేద్యమున్
రమ్మా, ప్రోవగ పద్మసంభవు మహారాజ్ఞీ! మహాదేవి! నా
సమ్మానమ్ము గ్రహించి, నాకుమది, ప్రజ్ఞా ప్రాభవం బీయవే!

పలుకు వెలంది నీవనెడి భావన రమ్యము, రమ్యమెంతయున్
నలువకు రాణి వౌట, నలినమ్ము మనోజ్ఞము నీదు గద్దె, జి
హ్వాల నటియింతు వీ నరుల భావములం బ్రకటింప భాషవై
పలు విధముల్, విరించికి బ్రభన్ సమకూర్తు విపంచి మీటుచున్.

పుస్తకపాణి, జూచి, జన
ముల్, కడు గౌరవమున్ వెలార్తురా
మస్తకమంట పాదముల
మాటికి మాటికి మ్రొక్కుచుంద్రు, నీ
హస్తమునందు పుస్తకము
నాద్యమునై చెలువొందు, చిత్తవి
న్యస్తము నీదు పాదముల
చెంతనుచేతు ననుగ్రహింపవే.

అంచయె నీకు వాహనము
హత్తును మెత్తగ నిన్ను, చూచినన్
పెంచును మోదమున్, నడక
బెంచు ప్రమోదము, కాంతి చిమ్ముచో
మించును మించు, దానివయి
మేనును నిల్పుట, నీకెచెల్లె, నే
మంచును, బమ్మ కొమ్మ! కొని
యాడెద మూలతిథిన్ జగన్మతా!